# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

ంపుటము 3 రాజమహేంద్రవరము 16-6-1980 16





*— ఈ సంచికలో *—



1—7—1980 సంచికలో పారిజాతాపహరణ కావ్య సౌరభము, నన్నయ భారతంలోని శైశవములు, శిల్పదర్శనం శ్రీ శ్రీ అధివాస్తవికత మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


ందా :

వత్సరమునకు రు. 10—00.

ర్ధసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50 పై

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము ౩ | రాజమహేంద్రవరము 16-6-1980 | సంచిక

## దక్షారామము - ఇంద్రగంటివారి కవితావైశిష్ట్యము

— శ్రీ ధూర్జటి వేంకట బాలా



ఆధునికాంధ్ర సాహిత్య లోకంలోని సుప్రసిద్ధ క్షేత్ర కావ్యాలలో 'దక్షారామము' విశిష్టమైన స్థాన మాక్రమించింది. ఇరువదవశతాబ్దిని ఆధునికాంధ్ర సాహితీ నందనోద్యానంలో పుష్పించి, ఫలించిన మధురఫలాలలో ఒక్కటి యీ 'దక్షారామము'. ఏతత్కృతికర్త శ్రీఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. ఆధునికాంధ్ర కవిపుంగవులలో అగ్రగణ్యులైన వీరు, ఏతత్కావ్యాన్ని వినిర్మించి తమ సుసంస్కృతమైన కవితాధారను సాహితీలోకానిక అందించి ఆంధ్రసరస్వతికి గలకంఠాభరణంలోని ఒక రత్నమువలె, వెలుగొందుచున్నారు. సహజంగా సాహిత్యలోకంలో ఒక చమత్కారముంది. కొందరు కవుల పేర్లు తఱచుగా మనకు వినిపిస్తుంటాయి. కాని వారి రచనలు చదువుదామంటే, సామాన్యంగా అవి లభ్యంకావడం చాలాకష్టం. మరి కొందరి పేర్లు వారి రచనలద్వారా తెలుసుకొనవచ్చును. కాని వారు మటుకు సాహిత్యలోకంలో స్థిరంగా నిలబడుటకు సాహితీవేత్తల హృదయాలలో శాశ్వతమైన స్థానాన్ని పొందుటకు అర్హులు కారు. ఈ రెండువర్గాలలో ఇంద్రగంటివారు మొదటివర్గానికి వస్తారు. ఇక దక్షారామ కావ్యప్రశస్తిని గూర్చి అవలోకిద్దాం! ఒక్కసారి!

ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధశైవక్షేత్రాలలో 'దక్షారామము' ఒకటి. ప్రఖ్యాత త్రిలింగములలో 'భీమేశ్వరు డొకడు' త్రిలింగ-తెలుంగు శబ్దముల కొక అవినాభావసంబంధం గలదు. భీమేశ్వరుడు అచ్చపు తెలుగుదేవుడు. శ్రీనాథ కవిసార్వభౌముడు భీమేశ్వర పురాణాన్ని అచ్చమైన, రసవత్తరమైన తెలుగు కావ్యం భీమఖండంగా వినిర్మించినాడు. కవిసార్వభౌముని అమృతమయమైన వాక్కులో దక్షవాటిక అమరసీమగా రూపొందింది. అది తెలుగుప్రజలు చేసికొనిన పుణ్యఫలము. దక్షారామ క్షేత్రాన్ని గూర్చి పురాణాలు చెప్పుకథలు చరిత్ర పేర్కొను అంశాలకన్నా మిక్కిలి భిన్నమైనవి. పురాణాన్ని బట్టి ఇది దక్షుని పురము. దక్షాధ్వరధ్వంసన మిచటనే జరగినది. శివుడు భీమరూపము దాల్చి, త్రిపురాసురులను బరిమార్చి వారు పూజించు శివలింగమును పంచఖండములు గావించి ఐదుప్రదేశాలలో నుంచినా వానిలో ఒకటియే దక్షారామక్షేత్ర

ఇంద్రగంటివారి ప్రాచీనాంధ్ర అభిమ కవులలో అగ్రగణ్యుడు శ్రీనాథ సార్వభౌముడు. అందులకే శ్రీనాథ పటిష్ఠ రచనావిధానం, భావధార హనుమచ్ఛాస్త్రిగారు పుణికిపుచ్చుకొ 'దక్షారామ' కావ్యంలో వెల్లివిరియిం నారు.

శ్రీఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగా ఆధునిక కవిపుంగవులు. ప్రాచీన త్వాన్ని జీర్ణించుకొని, ఆధునిక భావ తకు పట్టంకట్టిన కవితావిశారదు డాయ వీరిరచనలలో దేశాభిమానం, దైవభ ప్రేమానురక్తి, అణువణువున వెల్లివిరి చుండును. దక్షారామకావ్య రచన నాటికి భావకవిత, అభ్యుదయ క మున్నగు నవ్యప్రక్రియలు ముమ్మరం సాగుచున్న వని, ఆకావ్య పీఠికలా 'మలిమాట'లో ఆయన మనకు తె నారు. సంప్రదాయసుగంధం తనబలా ఎంతబాగా చూపినను, దృశ్యాదృశ్యం అక్కడక్కడ భావకవితా ధోరణు అభ్యుదయవాసనలు బాగా స్ఫురించుచుండును. అందువలన నీ కావ్యరచన

నకు ఎట్టి భంగం కలుగకుండా ఒక క్రొత్తపలుకు సిద్ధించి మెఱుగుపడినదే కాని, ఏమాత్రం తరుగుర్రాలేదని శాస్త్రి గారు అభిప్రాయపడిరి. ఇక 'దక్షారామ కావ్యం'ద్వారా ఇంద్రగంటివారి కవితా వైశిష్ట్యం ఏవిధంగా మెఱుగుపడిందో తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం. దక్షారామకావ్యాన్ని స్థూలంగా చూచినచో దానికి ఎనిమిదిరకాలైన శీర్షికలున్నాయని తెలుస్తుంది 1. ఆముఖము 2. దర్శనము 3. ప్రథమదృశ్యము (ప్రతిష్ఠ) 4, ద్వితీయదృశ్యము (మహర్షి) 5. తృతీయదృశ్యము (కవిసన్మానము) 6. శిల్పసందర్శనము, 7. సింహావలోకనము, 8. స్వస్తి' అని ఎనిమిది ముఖ్యమైన శీర్షికలను గమనింపవచ్చును. ఈవిధంగా విభజించడం కావ్యలక్షణమైతే కావచ్చుంగాని, దానికిపెట్టినపేర్లను గమనించినచో, కవికి ప్రాచీనాంధ్ర కవిత్వంపైగల మక్కువ, సంస్కృత ప్రజ్ఞాపాటవాలు ఎంత గొప్పవో తెలియవచ్చును. మొదటిశీర్షికయైన 'ఆముఖము' లోని యీ క్రిందిపద్యాన్ని గమనించినచో తెలుగుదేవుళ్ళకు ఆయన చూపిన భక్తిప్రపత్తులెట్టివో తెలిసికొనవచ్చును.

'శ్రీగిరి మల్లిఖార్జున గ
 రిష్ఠ మహీశుడు, దక్షవాటికా
భోగివిభూషణుండు, నెల
 పూఁదలతాలుపు కాళనాథుడున్
మూగురు తెల్గు భూజనుల
 పున్నెపుఁబ్రోవులు, భక్తవాంఛిత
త్యాగులు, భక్తియుక్తి కుసు
 మాంజలి నెత్తుదమోయి! వారికిన్'

త్రిలింగాలమధ్య నున్న దేశంకాబట్టి ఆంధ్రదేశానికి త్రిలింగదేశ మని పేరు వచ్చింది. దక్షారామము, శ్రీశైలము, కాళహస్తి అని మనము త్రిలింగాల కొక అర్థాన్ని చెప్పుకొందుము. కానీ అది సరియైన అర్థంగాదు. త్రిలింగము లనగా శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము అని యీకవి పైపద్యాన్నిబట్టి మనకు తెలుపుచున్నాడు. మొదట నీత్రిలింగములను, కవి స్తుతించుటనుబట్టి, కవికిగల దేశాభిమానం ఎంతగొప్పదో తెలుస్తుంది. కావ్యోపక్రమాన సహజంగా ఇష్టదేవతాస్తుతి జరుగుతుంది. కానీ యిచ్చట తెలుగు దైవతములకు భక్తిపూర్వకంగా పుష్పాంజలులు సమర్పించి కావ్యోపక్రమాన్ని చేయుటనుబట్టి, అతనికిప్రేయసీరక్తియేగాక, మాతృదేశంపట్ల గల భక్తియు ఎంత ఉదాత్తమైనదో రసహృదయులు అవగతము చేసికొందురు. కవికి కావలసింది కావ్యంలో రసోత్పత్తి చేయగలిగిన శక్తిసామర్థ్యాలు, రసజ్ఞునకు కావలసింది ఆకావ్యంలోని రసాన్ని ఆస్వాదించగలిగిన నేర్పు. ఈ రెండింటికి అవినాభావసంబంధం గలదు. అప్పుడే కవి చేతినుండికూడా రసజ్ఞుడు ఊహించినంత రసాన్నివ్వగలిగిన కావ్యము ఊడిపడును. 'ఆముఖము'లోని పద్యాలనుబట్టి దక్షారామములోని శివాలయనిర్మాణము లెదుట కన్పించినపుడు కవికి గలిగిన అనుభూతులెట్టివో పఠితలు అర్థము చేసికొనగలరు. ఆంధ్రదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా నేలిన రెడ్డిరాజులు, చాళుక్యులు మొదలగువారికి శివభక్తి ఎక్కువగా ఉండెడిది. అందులకే జీవకళ, శిల్పకళా వైభవాలు ఉట్టిపడేరీతులలోవారు దక్షారామ దేవాలయ నిర్మాణం గావించి శివునిపట్ల తమ భక్తి ప్రపత్తులను వెల్లడించుకొనిరి. కావ్యారంభంలో కవి యీ విషయాన్ని ప్రస్తావించడాన్ని బట్టి ఆయనకుగల మాతృదేశాభిమానం ఎట్టిదో చక్కగా వెల్లడి యగుచున్నది.

రెండవ శీర్షికయైన 'దర్శనము'లో దక్షపురీవర్ణనము గలదు. ఇందులో ఒక పద్యం 'భీమఖండం' ఆధారంగా రచించిన దని కవి తెలిపినాడు. దక్షారామములోని భీమేశ్వరుడు మిక్కిలి విశిష్టుడై భక్తుల పూజలను స్వీకరించినాడు. ఈ క్రిందిపద్యంలో కవిగా తాను దేవాలయాన్ని సందర్శించినపుడు కలిగిన అనుభూతులను తెలుపుచున్నాడు. ఇది దర్శనమనే శీర్షికకు తలమానికము.

'ఇక్కడ గాలువెట్టగ న
 దేమిమహత్త్వమొగాని యూహకున్
టెక్కలు వచ్చినట్లు చన
 నేరనిపూర్వయుగాల ప్రాలుదున్
ప్రాక్కమనీయకాలనృప
 వైభవసీమల జీవరక్తి నా
దృక్కులలోఁ బచారులొన
 రించి నను బలికించునేదియో!'

పైపద్యంలో 'ఊహకు టెక్కలువచ్చినట్లు' అను భావము చాలా యుక్తంగా నుండి కవియొక్క ప్రతిభను చాటుతుంది.

మూడవశీర్షికయైన ప్రథమదృశ్యంలో 'పార్వతివర్ణనము, మాహేశ్వరుని జననము పేర్కొనదగినవి. పంచారామాలను గురించి గావించిన ఈక్రిందిపద్యము కవి ప్రతిభకు మచ్చుతునక కాగలదు. పంచారామాలను గురించి చేసిన వర్ణన మింతకుముందే చక్కగా వివరింపబడినది. కానీ అందుకు సంబంధించిన అంశాలు ప్రస్తుత మిక్కడ వివరింపబడుతున్నాయి.

'క్షీరారామమును గుమా
రారామము నమరనామకారామము సో
మారామమ్మునఁ గను ద
క్షారామమునాఁగ వెలయు నయ్యై
 యెడలన్'

పైపద్యాన్ని బట్టి యీ ఐదు ఆరామాలలోని దేవుడు శివుడు. తెలుగుదేశాన్ని పరిపాలించిన పెక్కుమంది రాజులు శివునిపట్ల తమ భక్తిప్రపత్తులను ప్రకటించుటకు, తామందరు శైవమతానికి చెందినవారగుటవలన, తెలుగుదేశంలో పెక్కుస్థలాలందు శివాలయాలు నిర్మించారని కవి చారిత్రకాధారాలనుబట్టి చెప్పుచున్నాడు.

ఇక ద్వితీయదృశ్యము 'మహర్షి' లో వ్యాసభగవానుడు తనశిష్యులతో కాశీలో బహిష్కరింపబడి ప్రవాసియై దక్షారామమునకు వస్తాడు. ఆవిధంగా వచ్చిన వ్యాసునకి పుణ్యక్షేత్రమైన దక్షారామంలో తగిన అతిథిసత్కారాల నొసంగుటకు స్వాగతమిచ్చు దృశ్యం యీక్రింది పద్యంద్వారా వ్యక్తమగును.

'స్వాగతమోయి ! వేదపర
మార్గవిదాంవర వ్యాససన్మునీ !
స్వాగతమయ్య భారత మ
హాకవిశేఖర ! జ్ఞానమూర్తి ! స
ర్వాగమతత్త్వవిత్తమ సి
తాంబుజ కంబు పటీరవాస్తుషా
రాగసమానకీర్తివిభ
వా ! దయసేయుము దక్షవాట్యకిన్'

వేదపరమార్గవిదాంవరుడు,మహాభారత పురాణరచనా ధురంధరుడు, సర్వాగమతత్త్వవిత్తముడు, అసమాన కీర్తివిభవుడునైన వ్యాసభగవానుడు ఉత్తరదేశం నుండి దక్షిణదేశంలోని దక్షారామానికి వచ్చినపుడు కవి ఎదురేగి స్వాగతము పల్కెనని పైపద్య మందలి భావమై యొప్పినది. వ్యాసుడు దక్షారామమునకు వచ్చుట ఒక విశేషము. బహుశః కవి కూడా వ్యాసునకు కలిగిన అవమానమును త్రోసిపుచ్చి, ఆతని మనస్సులోనిబాధను తొలగించి దక్షారామభీమేశ్వరుని కృపాకటాక్షాలను ప్రసరించునట్లు చేయుట యుక్తంగా నుండు నని కాబోలు ! నీ విధమైన స్వాగత మిచ్చినాడు ! బహిష్కృతుడైన వ్యాసమునీంద్రుని గురించి బాధపడుతూ, కాశీపట్టణంలోని ధనవంతులు తమ ధనమదంచే కన్నుగానక ప్రవరిస్తున్నా రని, వారిమద మణచవలెనని, అందుకు తగిన పరిష్కార మార్గమాలోచింపవలె నని, యీక్రింది పద్యంద్వారా శ్రీ శాస్త్రిగారు తమబాధను వ్యక్తం చేయుచున్నారు.

'ఉన్నగంటమ్మునకుఁ జేవయుండుగ లేదు
ఈశిరస్సున ధిషణ యిట్టింక లేదు–
అంజలిఘటింప నతడు ఫాలాక్షుడేని
తెగువ నన్నక్రమమ్ముగా ధిక్కరింప'

పైపద్యంలో ఇంద్రగంటివారి కవితావైశిష్ట్యం, కవితాతత్త్వమేకాక, ఆయన వ్యక్తిత్వమేమిటో మనకువ్యక్తమౌతుంది. కవికి కావలసినవి కేవలంభావపరంపరలే కాదు. భావానికి తగిన ఆవేశం, అవసరమైనచో తగిన గంభీరతత్త్వం ఉన్నప్పుడే ఆ సంఘటనకు తగిన బలం కలుగుతుంది. ఎంత భావుకులైనను, ఎంతటి నవ్యకవితా ధురంధరులైనను ఆవేశం లేనిచో కావ్యానికి జీవం లోపించును. ఉన్న గంటమ్మునకు చేవ యుండుగ లేదు. అనుటలో ఇంద్రగంటివారు తమ వ్యక్తిత్వాన్ని తెల్పుచున్నా రని వ్యక్తమౌతుంది !

అన్ని శీర్షికలకన్నా విలక్షణమైన శీర్షిక 'తృతీయదృశ్యము' (కవిసన్మానము). రెడ్డిరాజులు రాజమహేంద్రవరమును పరిపాలించిరి. శ్రీనాథుడు రెడ్డిరాజుల ఆస్థానకవిగా నున్నప్పుడే 'భీమఖండము, కాశీఖండము' ఇత్యాది ఖండకావ్యాలను వెలయించినాడు. ఈక్రింది పద్యంలో శ్రీనాథుని కవితాతత్త్వం, (ఆయన) రచనావిధానాలను శ్రీశాస్త్రిగారు ఎంతవరకు అనుకరించారో యీ పద్యంద్వారా వ్యక్తమౌతుంది. శ్రీశాస్త్రిగారు తమరచనలో శ్రీనాథుని అనుసరించుట కేవలం వారిమీదఉండే అభిమానం వలననేకాని అంతకంటె వేరుగాదు.

'జాదురజాదురమ్ము సర
స ప్రియగీతము లెత్తి హంసికా
నాదములుఁన్ ఛికీమృదుని
నాదములుం గళపాళి మ్రోయగా
మోదమునన్ సువర్ణమయ
మోహనవీణలఁ గొంద ఱంగనల్
భూధరరాజునల్లుని శి
వుం గొని యాడిరి పాడి రాదృతన్'

పైపద్యంలోని 'జాదుర జాదురము' అనుశబ్దాన్ని ప్రయోగించుటలో మిక్కిలి వైలక్షణ్యముగలదు. శ్రీనాథుడీ శబ్దాన్ని పలుమారులు ఉపయోగించినాడు. శ్రీ శాస్త్రిగారు నీశబ్దాన్ని 'మిక్కిలి చాతుర్యము' అను నర్థంలో ఉపయోగించిరి. శ్రీనాథుడుకూడా యీశబ్దాన్ని అదే అర్థంలో ఉపయోగించినాడు. ఇక 'శిల్ప సందర్శనము'కూడా యీ కవి కవితావైశిష్ట్యానికి ఒక మచ్చుతునకగా స్వీకరింపవచ్చును. 'దక్షారామ' కావ్యంలోని శిల్పసౌందర్యవర్ణన మంతయు దక్షారామ దేవాలయమునకు సంబంధించినది.'తెలుగువారు గొప్పభక్తులు. ఎన్నిరాజ్యాలు తలక్రిందులైనా, ఎంతచరిత్ర మరుగుపడ్డా, తెలుగుదేశంలో ఈ దివ్యలింగాలకు ఎటువంటిచలనం కలగలేదు.' అను భావం యీ శీర్షికలో కవి తెలిపినాడు. మొత్తం మీద దక్షారామ కావ్యానికి యీ శిల్ప సందర్శనము ఒక మణి భూషణంవంటిదని పేర్కొనవచ్చును.

సింహావలోకనంలో కూడా శ్రీనాథ కవిసార్వభౌమునిపట్ల కవి తన భక్తిప్రపత్తులను వెల్లడించుకొన్నాఁడు. 'భీమఖండము' ద్వారా మహానుభావుడైన శ్రీనాథ మహాకవి తనభక్తిప్రపత్తులను శ్రీనాథుని పట్ల వెల్లడించుకొన్న విధంగానే, ప్రస్తుత కావ్యకర్త హనుమచ్ఛాస్త్రిగారు తన 'దక్షారామము' ద్వారా, దక్షారామ భీమేశ్వరునకు వినయాంజలులు ఘటించి ఏతత్కావ్యాన్ని ఆదేవునకు అంకితం చేసి తనభక్తి ప్రపత్తులను వెల్లడించుకొన్నారు. కావ్యాంతాన 'స్వస్తి'లో కూడా ఆయన యెంతటి శివభక్తుడో తెలుగు ప్రజలకు వెల్లడించారు. దక్షారామ కావ్యం మొత్తాన్ని చదివాక అనుభూతి పరమైన పద్యం నాకు నచ్చిందొక దాని నిక్కడ గుర్తుచేస్తున్నాను.

'గౌరీకోమల వల్లికాశ్రితము, గం
గాఫేన పుష్పోత్కరం

చార క్తస్ఫుట జాటజూటకిసల
వ్యాస క్తముద్భావహ శా
ఖారమ్యమ్ము, కృపాలవాలము, ఫలా
ఘత్యాగశీలమ్ము, ద
క్షారామస్థితకల్ప భూరుహము కాం
క్షల్ దీర్చు మాకెప్పుడున్'

ఉత్తమకావ్యమైన దక్షారామమనే మహావృక్షము భక్తుల కోరికలను ఎల్లప్పుడును తీర్చునని పలుకుటలో కవి ఎంతటి నేర్పును సాధించాడో అర్థమౌతుంది.

ఆలంకారికులు నిర్ధారించిన దానిని బట్టి కవికి ఉండవలసినవి మూడేమూడు ముఖ్యమైన గుణాలు. 1. ప్రతిభ 2. వ్యుత్పత్తి 3 అభ్యాసము. ఈ మూడింటిలో ప్రతిభయే గరీయసి. దక్షారామ కావ్యాన్ని చదివాక ఇంద్రగంటి వారికి యీమూడు లక్షణాలు పుష్కలంగా ఉన్నాయన్న విషయం అర్థమౌతుంది.

సాహిత్యము ఒక జీవననదివంటిది. అందు ఎంతోమంది కవులు ప్రకాశించు చుందురు. కొందరు తమ కవితా వైశిష్ట్యముచే చిరకీర్తి నార్జించు కావ్యములను సృష్టించి సాహిత్యలోకానికి అందచేయుదురు. ఏకావ్యమైనను ఉత్తమ లక్షణాలు కలిగియున్నప్పుడే అది సర్వకాలములందును, ఉత్తమ కావ్యంగా పరిగణింపబడును. అలనాటి శ్రీనాథుని 'భీమఖండము' బ్రతికినంతకాలము, ఇంద్రగంటి వారి 'దక్షారామ' కావ్యం కూడా బ్రతుకుండని చెప్పడంలో ఎలాంటి అతిశయోక్తి లేదేమో!

హనుమచ్ఛాస్త్రిగారి యితర రచనములలో 'హనుమచ్ఛాస్త్రి కథలు, విజయదశమి (కథలసంపుటి) తెలుగువీణ, మధువని, పాటల మంజరి, భాసనాటకమైన 'ప్రతిమ'కు అనువాదం, అలాగే 'వసంతసేన' వంటివి పేర్కొనదగినవి. దక్షారామ కావ్యరచనాకాలం నాటి కివి ఆయన యితర రచనలైతే, యీనాడు 'కాళిదాస కళామందిరము' (విమర్శ). 'సారమతి నన్నయ' (నన్నయభట్టారకుని మీద ఒక సమగ్రమైన గ్రంథము), 'కీర్తితోరణము' (కావ్యము) వంటి మేలిమిగ్రంథాలు కూడా ఆయన రచనలలో చేర్చబడినవి. వీనిలో కీర్తితోరణ కావ్యానికి, కాళిదాస కళామందిరము (విమర్శ) నకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డులు లభించినవి. కాలంతోపాటు, తమ అభిరుచులను కూడా మార్చుకొంటూ భవిష్యత్తు వైపు పరుగిడే ఆధునిక కవి పుంగవులలో శ్రీశాస్త్రి గారు ఒకరని చెప్పగలను.

— ... —

# దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి - సృష్టి'

— శ్రీ పి. అర్జున్‌రావు, బి. ఓ. ఎల్.

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి గారు భావకవులలో పేర్గాంచినవారు. వీరి రచనలలో కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి మున్నగు భావకవితా ఖండికలు ముఖ్యములైనవి. ఇప్పుడు ఊర్వశి అను కవితాఖండికను గురించి చర్చించబడును.

ఊర్వశి యనగానే చాలామంది దృష్టిలో దేవేంద్రసభలో నాట్యగత్తె యని భావింతురు. పూర్వము యయాతి మహారాజు కుమారుడు ఐన పురూరవుడు దేవేంద్రునికి దేవదానవ యుద్ధములలో సహాయపడుచుండెడివాడు. అతడొక నాడు స్వర్గము నుండి తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యమున కేశి యను రాక్షసుడు ఊర్వశి (దేవేంద్రునిసభలో నాట్యగత్తె)ని ఎత్తుకొని పోవుటను గాంచి వానిని వధించి ఆమెను రక్షించినాడు. ఆనాటినుండి వారిద్దరు సాహచర్యము చేయుచుండిరి. వారిద్దరి సమాగమ ఫలితముగనే ఆయువు అను పుత్రుడుదయించెను. పుత్రోదయమైన వెంటనే పురూరవునికి చెప్పకయే ఊర్వశి స్వర్గమునకు వెళ్లెను. ఒకఋషితపస్సు చేయుచు తనకు రంభాద్యప్సరసలచే తపోభంగము కలుగకుండ తను తపస్సుచేయు ఆవరణలోనికి వచ్చువారు తీగలుగా మారిపోవలయునని శపించెను. మార్గమధ్యమున వెళ్ళుచున్న ఊర్వశి ఆవరణలోనికి పోయి తీగగా మారిపోయినది. ఊర్వశి కనిపించకుండా పోయిననాటినుండి పురూరవుడు ఊర్వశీ! ప్రేయసీ! అంటూ పిచ్చివానివలె తిరుగుచు కనిపించిన చెట్టును, గుట్టను తన ఊర్వశిగా భావించుకొనుచు, చివరకు ఆతీగను కౌగలించుకొనగా స్త్రీ మూర్తిగా మారిన ఊర్వశి తిరిగి తప్పించుకొని పారిపోనారంభించెను. అలాగే ఒకరినొకరు వెంబడించుకొనుచుండగా లోకమంతా 'ఊర్వశీ! ప్రేయసీ!' అను ఆర్తనాదము వినిపించెను. ఆనాటినుండి 'ఊర్వశి' అనునది ప్రసిద్ధికెక్కినది. అదియే శాస్త్రిగారి కవితకు పెట్టినపేరు అనికొందరి అభిప్రాయము. ఆంగ్లకవులు వ్రాసిన భావకవితకు సాటిగా 'రవీంద్రనాథ్ ఠాకూర్' తన గీతాంజలిలో 'ఊర్వశి' అనుపేరు పెట్టి ప్రకృతి ఒక సౌందర్యమూర్తిగా తన కవితకు రూపుకట్టించినాడు. అదియే తర్వాత భావకవులకు మార్గదర్శకమయ్యెను. దీనిని బట్టే శాస్త్రిగారు తన ఊర్వశిని సృష్టించినాడని కొందరి అభిప్రాయము. ఒకవిధంగా పరిశీలిస్తే ఈ వాదమే సమంజసమని తోచుచున్నది.

ఈవిధంగా వేంకటకృష్ణశాస్త్రిగారు తన కవితాఖండికలో ప్రకృతిని ఒక సౌందర్యస్త్రీమూర్తిగా భావించి రచించిన, తన మనస్సుచే దర్శింపబడిన కేవల

భావనా సౌందర్యమూర్తియే ఊర్వశి యని చెప్పవచ్చును 'కామిగాక మోక్షగామిగాడు' అన్నట్లు కవి హృదయంలో ఒక భావన రేకెత్తినచో వెంటనే దానికి తనకళాహృదయంలో ఒక సుందరరూపం కల్పించును ఆరూపమే యిక్కడ స్త్రీ మూర్తిగా వ్యక్తీకరింపబడిన ఈఊర్వశి శాస్త్రిగారి సౌందర్యోపాసనా హృదయమునకు నిదర్శనము చాలమంది భగ్న ప్రేమికులు, ప్రేయసీప్రియులు ఒకరికొకరు దూరమైనప్పుడు విరహగీతికలు వ్రాస్తారు, పాడుతారు కాని వీరి దృష్టిలో మాత్రం అది గాదు ప్రకృతినే ఒక స్త్రీమూర్తిగా భావించి తన కనుగుణముగా తనను, తన జీవితమును ఆప్రకృతికే అంకితము చేసే విధంగా ఆయన ఈకవితాఖండికలో తన భావనకు ఒకరూపమునిచ్చి మనకు గోచరింపజేయుచున్నాడు ఆభావనామూర్తియే స్త్రీరూపముగా కనిపించు ఈ 'ఊర్వశి'

దీనియందు శాస్త్రిగారు ప్రకృతిని వజ్రముగా వర్ణించినాడు దానినుండి వెలువడుకాంతి కిరణమును మానవజీవితముతో పోల్చినాడు రత్నము స్థిరమైనది, కాని దానినుండి వెలువడిన కిరణము ఎచ్చట పడుతుందో తెలియదు రత్నంలాంటి ప్రకృతితో కిరణంలాంటి మనిషికి గల సంబంధం ఆరెండింటి మధ్యనున్న సంబంధంలాంటిదే అల్లె 'తొలిప్రొద్దునునుమంచు తీవసోనవు నీవు 'నీవు వర్షాశరత్తుల నిబిడ సంగమమున బొడమిన సంధ్యాకుమారి'విశ్వ వేదనామూల్య భాగ్యమీవే' యని ప్రకృతిని చక్కగావర్ణించినాడు వర్షాశరత్తుల నిబిడ సంగమమున' అనుటలో ప్రకృతిక వర్షాశరత్తులు ఉదయరాగమును కల్గించును అలాగే మానవ జీవితములో స్త్రీ పురుష సమాగములకు, కలుగు సంతానములకు వర్షఋతువులో ప్రకృతి శుభము కల్గించు నని అంటారు అందుకే అలా వర్ణించినాడు కాబోలు ఇందు 'వీని కృపణజీవితగళమ్ము ఎండ వాకల చివికిపోయినది పాడదోయను సందేహము వలదు' అని చెప్పుకొన్నాడు బహుశః అతనికి నోటమాట కరువైనందుకేనేమో తనబాధను భావనారూపంలో వ్యక్తపరిచాడు అల్లే ఇందు మేఘము సముద్రునితో చెప్పుకొనుచున్నట్లు వ్రాసినాడు సామాన్యముగా సముద్రుని నాయకునిగా వర్ణిస్తారు దానికి తోడు నాయికగా మేఘమును వర్ణించినాడు నదీ ప్రవాహములకు, ఏటి నురుగులకు తడయుబాటు నేనే, అని మేఘముచే చెప్పించినాడు సముద్రము నింగిలో మేఘాలు క్రమ్ముకొనినచో ఉరుకుల పరుగులతో పైకెగసిపడును అదేనేమో మేఘమనెడి కన్యకు నాయకుడనెడి సముద్రుని ప్రాంగణంలో ఎదురైన అతని పిలుపు' అందుకే ఆనాటి కీనాటి కేను నీదాననేయని మేఘ మన్నట్లు భావవ్యక్తీకరణ చేసినాడు

ఆ ప్రకృతిదేవత కన్నులలో అనంతాకాశపు నీలిసీడలు కన్పించును ఆకాశమనెడి ఆమె కళ్ళలోగల నీటియందు నిదురచాయలు కనిపించును సాయంసమయమున చిఱుగాలిచే కదంబ వృక్షముల పాదులవద్ద పడి ఎండిన ఆకుల మర్మరధ్వను లనెడి గుసగుసలు వినిపించును వానాకాలంలో మేఘముల తెరవెనుక దాగు నీటిబిందువులు ఆమె నిర్మల నేత్రములలో కనిపించును ఇది ఆతని భావన ఏదో ఒక మధురానుభూతి స్ఫురించి హృదయము స్పందించును కాని ఏవో అర్థముగాని భావగీతములుమాత్రమేనట అవి ఈవిధంగానే భావకవుల భావనలు కూడ కాబోలు భావన అనగానే పనికిరాని గీతముల అర్థమని మాత్రం కాదు కాళిదాసాదులు లోకమున కందించిన రచనలలోనివి గూడా వారి భావనా ప్రతిబింబాలే కాని రెండింటిమధ్య మాత్రం తేడా ఉంది ప్రతి కవి రచించుటకు భావనఉండవలయును కాని వీరు ప్రత్యేకముగా మేమే భావకవుల మని చెప్పుకొన్నారంటే వసంతంవచ్చినచో నాయకునికి చాలా రోజులనుండి విడిపోయిన ప్రేయసి ఎదురైన విధంగా కవి ఏదో ఒక మధురానందము ననుభవిస్తాడు అందుకే 'ఓ వసంత విలాస మాధుర్యమా! ఓ యువఃకళ్యాణ లావణ్యమా'యని సంబోధించినాడు ఇచ్చట శాస్త్రిగారు ప్రకృతిని తన ప్రేయసిగా భావించినాడు కాట్టి ప్రకృతివసంతాలంకరణ,నాయిక అలంకరించుకొని ప్రియుని ఎదుట నిలబడినట్లు ప్రకృతికన్య వసంతమాసమున చక్కగా నలంకరించుకొని ప్రత్యక్షమవుతుంది అందుకే 'నేడు నాజీవితము నిర్జరాంగనాధరస్మితమై ప్రపంచాలు ప్రాకు నని నా హృదయము ఏడులోకాల ప్రేమకొరకు పిలుచు నని, తన మనస్సు చరాచరములకు పరపునని' వ్యక్తీకరించుకొన్నాడు అదేవిధంగా చివరకు 'ఆటపాటలతో నేర్చినట్లు దేవా! ఏనుకూడ నీవలె నటియింపనిమ్ము ఎడతెగని యాత్రనెట్లు సాగించువరకు, నీదర్శనమ్ము సాధించు వరకు' అని మొరపెట్టుకొన్నాడు

ఈవిధముగా భావకవియైనను ఏదో ఒక భావము కాకుండ ప్రకృతిని ఒక సౌందర్యమూర్తిగా నూహించుకొని తన భావనచే చక్కగా రూపుకట్టించి తన సౌందర్యారాధనను, కళాహృదయమును తను భౌతికముగా ఇహమున నున్నను మానసికముగా ఏనాడో పరమును చేరి ప్రకృతికి అంకితమైనట్లు కనబరచినారు ఈవిధముగా వారి రచన పండిత పామర హృదయాలలో చిరస్మరణీయముగా నుండవలయు -ని కోరుకుందాం

# చరిత్రలో పారశీక సాహిత్యము - 'ఉమర్‌ఖయ్యామ్'

- శ్రీమతి కొలచలమ శారద

(గతసంచిక తరువాయి)

స్వర్గనరకములన్నవి కల్పితములం
ానందదాయకము లగు భోగముల నీ జన్మ
ముందే అనుభవింపుము అని బోధించును
ాత్యమునందు గాఢనిష్ఠ కలిగిన ఉమర్

దేవళనీవు లేని గుడి ప్రార్థించుకంటె
ానవశాలను సత్యంబు పలుక మేలు '

అని తెల్పును అదృశ్యముగానున్నదైవము
న్న ప్రత్యక్షముగానున్న మానవతపై
ఉమర్ తన అభిమానమును ఇట్లు ప్రక
కించును

కలపము మట్టిరాల నిడి
కట్టిన దేవళమందు నీవు నే
ఫలము లభించు ప్రేమరస
భావయుతుండవ యేని కామినిన్
ఫలవుము ప్రాణహీనమగు
బండలు వేయిటికన్న శ్రేష్ఠమై
యలరుగదా మనుష్య హృదయంబు
ప్రతి ప్రణయానురక్తులన్

ఉమర్ తత్వ జిజ్ఞాస

కాల మెవ్వరికీ ఒక్కరీతి గడవదు' ఈసూక్తి సర్వకాలము లందు అన్వయింమనది ఉమర్ అపరవయస్సున అతని జీవితము - తిరుగబడినది అండదండముగా నున్న నిజాముల్ ముల్క్ హత్య గావింపబడెను రాజ్యమున అంతఃకలహములు - విప్లవములు చెలరేగినవి రాజకీయ, సాంఘిక, ప్రశాంతిలేని తావులందు సుఖజీవనములకు స్థాన మెక్కడ? ఉమర్ తన దుఃఖమును పానపాత్రలో ముంచి జీర్ణించుకొనవలె నని తలచెను మతాచారములను మంటకలిపి భ్రష్టుడాయె నని' లోకులు నిందింపసాగిరి ఖయ్యాం వారికి 'నేనొక తత్వవేత్త నని ంద యొనర్చిరి కాని వారు నా, మానస ప్రవృత్తివార లణుమాత్ర మెరింగిన నట్టు లందురే!' కానీ మరేమి! 'దేముడెరుగండె మనంబు గ్రహింప నసాధ్యము జన్మ మర్మముల్' అని తనను నిందించు వారి అజ్ఞానమునకు వెతచెందెను హో జి యనిపించు కొనుటకై మక్కాయాత్ర చేసివచ్చి, తన అశాంతి నిట్లు ప్రకటించెను

'కలపయు, మట్టిరాలనిడి
కట్టిన దేవళమందు నీవు నే, ఫలములంభించు
- ప్రాణహీన మగు బండలు వేయిటి
కన్న శ్రేష్ఠమై యలరుగదా! మనుష్య
హృదయంబు విధి అనివార్యమని
ఉమర్ మాటిమాటికి హెచ్చరించు చుం
డును విధినిబద్ధములై వచ్చు వెడలిపోవు,
అఖిల సుఖదుఃఖములు నీ కయాచితముగ.

విషము నమృతంపు మసిబుడ్ల విధికలంబు
ముంచిలోకుల నుగుటలిఖించు మొదట
కాన, నెది ప్రాప్తమై నను గారవించ,
వలయు, వల దని ఏర్పరుపంగ లేవు '

అని విధి నిరంకుశత్వమును ముక్తకంఠముతో ఘోషించును వివేకమున్న ప్రతి వ్యక్తికి తన ఉనికిని గురించి యాతాయాతములగు సుఖదుఃఖములను గురించి 'ఇది ఇట్లెందుకు జరుగును? మానవుడు తాను కోరుకున్న ఫలము నేల అందలేకున్నా!' డను విషయమున సమాధానము లభించని ప్రశ్న ఉదయించుచునే యుండును ఈ విషయమున భారతీయ వేదాంతము ఆయావ్యక్తి పూర్వజన్మ కర్మానుగుణముగా సుఖదుఃఖానుభవములు కలుగుచుండు నని సమాధాన మొసగును అయినచో సృష్ట్యాదివ్యక్తు లందరు పాపపుణ్యరహితులేగదా! వారి కెప్పటినుండి ఈ పాపపుణ్యభార మలవడినది? పాపపుణ్యముల కాలవాల మగు మనసు, తద్రూపము, తత్సంకల్పము, తదాచరణ, సర్వము అదృశ్యమగు శక్తివలన జరుగుచుండగా వాని ఫలము వ్యక్తికి అంటగట్టుట ఎట్టి న్యాయమగును? లోకములో ఏవ్యక్తియు దుఃఖానుభవమును కోరడు తాను ఆశించని దుఃఖములను నిర్నిమిత్తముగా పొందుచు కోరిన సుఖములకు దూరమగు చున్నాడనగా అదృశ్యశక్తి మానవుని నడిపించు ననుట స్పష్టమగుచున్నది వ్యక్తి ప్రమేయము లేక అదృశ్యశక్తి వలన అయాచితముగా పాపాచరణ చేసి తత్ ఫలితమగు దుఃఖమును మానవు డేల పొందవలెను? తన ఇచ్ఛలేకయే చేసినపాపమందు వ్యక్తిపాత్ర ధరించనప్పుడు తత్ ఫలమాత డెట్లు పొందును? మనసు - సంకల్పము - వానివలన వచ్చు పాప పుణ్యములు - సర్వము ఒకానొక తెలియరాని ప్రేరణ వలన జరుగునప్పుడు వ్యక్తిప్రాధాన్యము - అనుభవము - ఎందులకో తెలియరాదు ఇది మనభారతీయ సిద్ధాంతము జన్మకర్మల పరంపర ఇతరమతము లందు స్పష్టాస్పష్టముగా నుండుటచే ఉమర్ నిశాభుక్తావశేషాసవం, బును సీసాలకు నింపియొక్క నరకంబున్ ముంచి యందిమ్ము, ద క్కని యారే పటి మాట లేటికి అనుభోగ్యంబైన నేడుండగన్

తలచెద వేల నిన్నటి వెతల్ మరి నేడు
ముదంబుగూర్ప - ర, మ్మెలమిం బచ్చ
బయళ్ళలోన సెలయేటి తటాల
పచారు సేయగన్

సుం, దరి హృదయానుసారిణి! వనంబున
నీకయి వేచియుండ నీ తరుణమునన్
సుఖింపక పరచింతన లేల మర్త్యుడా !

ఈ మొ॥ భావములవలన ఉమర్ కేవల భోగలాలసుడు పరలోక చింతలేనివాడుగా వాచ్యార్థము లభించినను– జీవన్మిథ్యాత్వము ముందు వెనుకలు లేవు గనుక ప్రకృతము మాత్ర మంగీకరించి సుఖింపుమని ఉమర్ భావము జీవునకు కర్మబంధము, దాని ననుసరించి పుట్టుక, లేదని ఉమర్ విశ్వాసము విధి నాతడెంత అనివార్య మని తెలిపెనో తెలిసికొంటిమి గదా! విధిని నమ్మును ఇట్టి పరలోక చింతన లేనివానిని ఆంగ్లేయులు 'ఎపిక్యూరియర్స్' అందురు కానీ వారి సిద్ధాంతములతో ఉమర్ ఏకీభవింపలేదు 'ఆత్మ భౌతికము – ఇంద్రియగోచరమగు ప్రపంచమే ప్రధాన మయినది 'విధియనునది లేదు మరణానంతరమున జీవితము లేదు మనశ్శరీరములకు అనుకూల మగు విషయములనే గ్రహించి సంతోషపడవలె, నని ఎపిక్యూరస్' సిద్ధాంతము 'విధిని ఉమర్ సంపూర్ణముగా విశ్వసించును జన్మల విషయమున మరణానంతరము జీవితము లేదను విషయమున మాత్ర మిరువురు ఏకీభవింతురు. మానవుల భిన్నస్థితి గతులకు భారతీయులు కర్మ సిద్ధాంతము కారణమని సమాధాన మొందుదురు కర్మ సిద్ధాంతము నంగీకరింపని ఉమర్ అనేక విధముల దేవుని ప్రశ్నించును 'దేముడు కరుణామయుడగుచో కొందరికి సుఖములును, మరికొందరికి దుఃఖములు నేల కూర్చవలె?' 'ఇటకు నెందుండి వచ్చి – ఇంకెటకు బోవు, ప్రాణి యనుప్రశ్నకెవ్వాడు బదులుసెప్పు?' తన చేత నొనర్చినట్టి యొక పాత్రను భగ్నముం జేయు నే మనుజుండైన దలంప డంగముల నిర్మాణంబు గావించి మోహన రూపంబులు మోపి తేనె యెద లో నత్యంతరాగంబు గూర్చిన దేముడు మరల నిట్లు నిజసృష్టింగూల్చు నున్మత్తుడై! అని ప్రశ్నించును విధి అనివార్య మని చెప్పుటవలన ఉమర్ జీవితములోని అసహాయతను దుఃఖభాగమునుమాత్రమే తెలిపెనని కొందరందురు ఉమర్ భావనలో జీవితము సుఖదుఃఖ మిశ్రిత మయినది మరణము, దుఃఖములు అనివార్యము లగుటచే వానికై చింతింపక అందుబాటులో నున్న సుఖము లనుభవింపు మని తెలిపెను

## 6 ఖయ్యాం అద్వైతస్థితి

చివరిదశలో ఉమర్ 'జ్ఞానపటాలయమ్ము నొడికమ్మగ గుట్టు ఖయ్యామ్ నేడు దుఃఖానల దగ్ధుడయ్యె! యముడనే పెనుకత్తెర జీవితంపు బిత్తును గుడారుమోకు దిగకెత్తె ప్రపంచపు సంతలోన, దుగ్గానికి నమ్మె నిన్ను బలుగాకి దలారి విధాయి అయ్యయో!'

'ఇల చదరంగ మందు జను లెల్లరు పావు లహస్సులున్ నిశల్, దెల్పును నల్పుగళ్లు'

'బోధపడదేమొ యైహిక భోగశాల, సృష్టికర్త ఇట్లేల చిత్రించె నన్ను'

'ఆదిమధ్యాంతరహితుడై యలరునట్టి కాలయవనిక భేదింపఁగలమె మనము, ఇటకు నెందుండి వచ్చెనో ఎటకుఁబోవు ప్రాణి? యను ప్రశ్న కెవ్వాడు బదులు చెప్పు?'

మోవిదేనె యెదలో అత్యంతానురాగముంచి నిజసృష్టిం గూల్చు నున్మత్తుడై అనురాగహాలాహలముల నొకేమూసలో కల్పించిన నీచేతల కర్థమేమి? ఇట్లాడించుట నీకు వినోదమా? నీవు ఉన్మత్తుడవా? క్రూరుడవా? అని దేముని ప్రశ్నించును భారతీయ ధర్మానుసారముగా 'దుష్కృతులను బుణ్యకార్యములఁ జేయ లిఖించెను నిష్ఠ వాడె మత్కృతులకు మూలకారణము కీడును మేలును వాడి సేతలే' అని తన అసహాయత ప్రకటించినాడు ప్రపంచమందలి దృశ్యమగు ప్రతివస్తువు పాంచభౌతిక మనియు నాశన మొందిన పిదప ఏవస్తువు నుండి జనించెనో అందే లయమగు ననియు ఈతని నిశ్చితాభిప్రాయము.

అంతములేని ఈ భువన మంతయూ పురాతన పాంథశాల విశ్రాంతిగృహంబునందు నిరుసంధ్యలు రంగువాకిళుల్, ధరాక్రాంతులు, పాదుషాలు, బహారాం జమిషీడులు, వేనవేలుగా, కొంత సుఖించి పోఁబరెటకో పెరవారికి చోటొసంగచున్

విచ్చఁబోటికను వాడినపుష్ప మదెన్ని నాశ్యమకు జగన్మిథ్యాత్వమును జీవితక్షణికత నిరూపితములు 'నీడబొమ్మలు మనుజులు నిఖిలమునకు కాలచక్రంబ నిర్ణీత గతి యనాది' అని ప్రాచీనతతమును ప్రతిపాదించును.

శ్రావణ మేఘములంగానీ, శరత్కా మేఘములుగానీ, ఉన్నతాకాశపథము సంచరించు నేకానీ అధోముఖములుగాన

అట్టి లోకకళ్యాణార్థమవతరించిన మహా
యుల హృదయావిష్కరణము ఉన్నతా
శయములను ప్రతిబింబించును. పరిపక్వత
నందబోవుచు ఫలోన్ముఖమయిన మానసిక
ప్రవృత్తులు దేశకాలాతీతములు. అట్టి
పరిణతదశ నందబోవు మానవులు ఏ
దేశము వారయిననూ, ఏకాలమునకు
చెందినవారయిననూ వారి ప్రబోధ మొకే
రీతిగా, నుండు నను విషయము గమ
నార్హము

ఉమర్ కావ్యలక్షణము లన్నియూ, పట్టించి మహాగ్రంథములేవియూ రచింప లేదు సత్యస్వరూపనిర్ణయము చేయుచూ మానవతావాదియై వారికి సన్నిహిత మగు భావలలో, ఛందస్సులలో, హృదయములకు నాటునట్లుగా రుబాయీల నల్లెను కవిత లక్షణానుగుణముగా లేకపోవుట వలన సమకాలిక లీతని ఈ రచనల నంగీకరింప లేదు ఆతని మరణానంతరము కొంత ప్రచారము పొంది, హేతు వాదులగు ఆంగ్లేయులచే విశ్వవ్యాప్త మొనరింప బడినవి

ఉమర్‌తో ప్రథమముగా పోల్చదగిన కవి వేమన ఇతడు ఉమర్ వలెనే ఆట వెలది, చందస్సులో వేలకొలది చాటు వుల నాశువుగా రచించి సంఘములోని లోపములను నిశితముగా నెత్తిచూపినను కవుల గణనలోని కెక్కలేదు

సంఘములోని దురాచారము లన్నింటి నితడు నిర్భయముగా ఖండించెను ఇతని కవిత లక్షణాబద్ధముగా లేక, కవిపండి తాదరణ పొందకున్ననూ కవిత్వమునకు ఆ ప్రయోజనసిద్ధిని మాత్రము సంపూర్ణ ముగా పొందినది ప్రజల జీవితములో నాటుకొని సూక్తులుగా, సామెతలుగా వాడబడుటయే వేమన కవిత్వయోగ్యతకు తార్కాణముగా నున్నది సాంఘిక దురా చారములను, మతగురువుల కపట వ్యాపా రములను ఇరువురు మోమోటము లేక విమ ర్శించిరి

'మాయవేషముల్ భావములోని కల్మ షము బాపునె ?' _ ఉమర్

'తలలు బోడులైన, వలపులు బోడులా?'
_ వేమన

ఉమర్‌నకు శ్రీనాథునకు జీవిత సామ్య మెంతయో గలదు జీవిత మధ్యకాలము వరకు ఇరువురు మహాభోగము లనుభవించి నారు అపరవయస్సులో రెడ్డిరాజు లందరూ గతించగా శ్రీనాథుడు నామమా త్రావశిష్టుడై 'కాశికా విశ్వేశు కలిసె వీరా రెడ్డి' _ రత్నాంబరంబు లేరాయ డిచ్చు? అని వాపోన్నట్లుగా ఉమర్ ఖయ్యామ్ 'మనమున కెక్కినట్టి యభిమానులు, మిత్రులు చెల్లినారు యౌవన మధుమాస ము గుసుమభారము రాలిచిపోయె' _ అని నిశ్వసించును

ఇట్లే సహజకవి పోతన భావము లెట్లు ఉమర్ భావములతో మిశ్రమము లయి నవో గమనింపుడు

ఉమర్ _ పొలుపుగ మాట నేర్చినవి మూగవి కుండలు, రెండువేలు లోపల నొకమూలనుండి ఇటుపల్కె ననుం గని_ 'కుంభకారులన్ పిలిచినవారు మమ్ము బురవీథుల నమ్మినవార లేరి ? ఏతలమున కేగినారలు వదంతి యొదేనియు విన్న దెల్పుమా'

పోతన _

'కారే రాజులు రాజ్యముల్ కడువరే
గర్వోన్నతిన్ చెందరే!
వారేరీ? సిరిమూటగట్టుకొనిపోవంజాలిరే?

అని ప్రశ్నించుటలో ఇరువురకూ భావ సామ్య మెంతయో స్పష్టమగుచున్నది.

ఉమర్ _ 'అఖిల పురాణశాస్త్ర తత్వాబ్ధులీది ఈది _ పరమ విజ్ఞానదీపమా పండితుండు _ కాళరాత్రిని మార్గంబు కానలేక యల్ల మామూలు కథ చెప్పి యంతరించు, 'అచ్చపుచీకటింబడి గృహా గ్రతులై, విషయ ప్రవిష్టులై, చచ్చుచు పుట్టుచున్ ఏమిచ్చినసైన కానలకు నేగినసైన వారి ప్రబోధముల్ ?

ఇట్లు భర్తృహరి తెలిపిన సుభాషితము లను ఉమర్ తన గ్రంథమున పొందుపర చెను 10వ శతాబ్దమున ఉమర్ ఖయ్యామ్ మహాకవి వెలువరించిన సూక్తిరత్నాకరము ఆంగ్లేయులవలన ప్రాచుర్యమును పొంది నది ఆంగ్లభాషా పరిచయము లేనివారికి ఉమర్ కవితామధువు నందజేయుటకై కీ శే దువ్వూరి రామిరెడ్డిగారు వాని నాంధ్రీకరించుట సాహిత్యపాఠకుల సుకృత విశేషము తప్ప మరియొకటి గాదు శ్రీదువ్వూరి రామిరెడ్డిగారు మూలభావము లోపము నందనీయక తమ సహజ కవితా పాటవముతో స్వతంత్ర కావ్యమునువలె సంతరించిరి

'పానశాల అను గ్రంథనామ మెంత యో ఔచిత్యయుక్తమై వస్తునిరూపణ యొనర్చుచున్నది పారశీక మహాకవి ఉమర్ ఖయ్యామ్‌నకు రసభంగము కలుగ నీయక, ఔచితితో అనువాద మొనర్చిన రామరెడ్డిగారికి ఆంధ్రసారస్వత మెంత యో ఋణపడియున్నది అనుటలో సందే హము ఆవంతయూ లే దని చెప్ప వచ్చును

— —

# కథాసమాలోచన

డాక్టర్ ఆలూరి విజయలక్ష్మిగారి

## 'మాకీభర్త వొద్దు!' కథల సంపుటి

కళాకారులంతా స్త్రీ సములే అని ఆలంకారికమతం. రచయితలూ, కవులూ- సాహిత్యకళాకారులు అట్టివారు పురుషులే అయినా అంతరికంగా స్త్రీహృదయలావణ్యమూ, ఆర్ద్రతా ప్రధానగుణాలని వారు విశ్వసించారన్న మాట. ఇక కళాకారులు అచ్చంగా స్త్రీలే అయితే తాము చేపట్టిన కళాస్వరూపం మరింత కోమలంగానూ, రసగంధబంధురంగానూ ఉంటుందని వేరే చెప్పనక్కరలేదు. నిర్మాణకారంగా ఆలోచిస్తే లలితకళలన్నీ స్త్రీత్వంనుంచి ఆర్ద్రత నుంచీ పుట్టేవే! కనుకనే నేటికాలంలో అచ్చంగా స్త్రీల పరంగా ఉద్భూతిమైన సాహితీ స్వరూపాలు - కథ నవల వంటివి, పాఠక జన మనోహరంగా విశేషఆకర్షణ కలిగిస్తున్నాయి. ఈ తత్వం గ్రహించిన వారు కావడం వల్లనే ఋషికల్పులైన మన ఆలంకారికులు సాహిత్యమందించే ఉపదేశం కాంతాసమ్మితంగా ఉండాలని నొక్కివక్కాణించారు.

డాక్టర్ విజయలక్ష్మి కథనచాతురిలో అసంఖ్యాక రచయిత్రుల నుంచి వేర్పాటు చేయగల అసాధారణ ప్రజ్ఞలు సుగోచరమవుతాయి. అవి ప్రధానంగా 1) Anti Sentiment (అంటే హృదయాన్ని తేలికగా కరగించి కన్నీళ్లు తెప్పించే రసభావాలతో విజయాన్ని సాధించడం కాక ఏకకాలమందు మనసుకీ హృదయానికీ సమాన స్థాయిలో appeal కలిగించడం. 11) Scientific approrch (అంటే సన్నివేశాల పట్లనూ, పాత్రల శీలపరిశీలన విషయంలోనూ యాదృచ్ఛికతకన్న శాస్త్రీయ అవగాహనపరమైన క్రమపరిణామాన్ని సాధించడం.) ఈ పద్ధతి కళాత్మకంగా విజయం సాధించడానికి క్లిష్టమైనదే! కనుకనే పరిశీలనార్హమవుతున్నది.

'మాకీభర్తవొద్దు' అనే ఈ కథలసంపుటికి శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ ఎంతో చక్కని పీఠిక రచించారు. 'మాకీ భర్తవొద్దు, ఒట్టు నేను తాగను' వంటి పేర్లు పెట్టకుండా - ఇంతకంటె మంచి పేర్లుపెట్టి ఉండవలసింది. బంగారు తీగ లాగు, లేతతమలపాకులాగ, చంద్రకిరణం లాగ మెరసిపోయే అమ్మాయికి పిచ్చెమ్మ అనే పేరుపెట్టినట్లుంది' అని శ్రీ సుశర్మ అభిప్రాయపడ్డారు. నేనీఅభిప్రాయంతో బేషరతుగా ఏకీభవిస్తాను. కథకాని, కవితగాని, ఆలోచించడానికి ఎంత శ్రమా, కాలమూ వెచ్చించాలో దాని శీర్షికను రూపొందించడానికి సైతం అంతకంతకు తక్కువ శ్రమా, కాలమూ సరిపోవు. ఐతే ఆ శ్రద్ధ చాలామంది రచయితల కుండడంలేదు. కనుకనే చక్రాలతోనో కిరీటాలతోనో పబ్బంగడుపుకుంటున్నారు. శీర్షికసముచితంగా అమరితే భారం సగానికపైగా నిర్వహించగలుగుతుంది. రచననే విశిష్టదీప్తితో భాసింపచేస్తుంది.

ఐతే వ్యాపార దృష్టితో చూస్తే మాకీభర్తవొద్దు కలిగించే ఆకర్షణస్థాయి వేరుకావచ్చు. కళా హృదయులు వ్యాపారదృష్టికి కట్టుబడిపోవడం వల్ల యిప్పటికే మన సాహిత్యానికి అపారనష్టం వాటిల్లింది. ఈ దృష్టితో చూస్తే ఆధునిక కవిత్వానికి వ్యాపార పారావారంలో ఈదులాడ వలసిన దుస్థితి కలగలేదు కనుక - ఆ సాహిత్య ప్రక్రియే పరిశుద్ధంగా జీవించగలుగుతోందనిపిస్తుంది.

డాక్టర్ విజయలక్ష్మి గద్యశైలి హృద్యమైనది. తికమకలు లేకుండా, కప్పదాట్లు లేకుండా అలాగని పులుముడూ అలుకుడూ లేకుండా - అభిప్రాయాలను సూటిగా అభివ్యక్తం చేస్తుంది. స్వీయతాత్త్విక కువ్వాదాల బరువు ప్రవేశించదు. కథతోనిమిత్తంలేని వైజ్ఞానిక తార్కికాంశాల చర్చ బరువుగా దురాక్రమణ చేయదు. తాను వృత్తి రీత్యా మంచి డాక్టరే కావచ్చు. కాని ఆ సంబంధి శాస్త్రజ్ఞాన మంతా వీలయినపుడల్లా కథలలోనికి చొప్పించడానికి ప్రయత్నిస్తే కథ తన వైద్యవృత్తికి ఉపాంగంగానూ మారిపోతుంది. కళా హృదయులెవరూ దానిని ముట్టుకుందుకే భయపడే స్థితి కలుగుతుంది. ఇటీవల కొందరు తమకు తెలిసిన సైంటిఫిక్ విషయాలను ఏకరువు పెట్టడానికి కథానికా వేదికను వాడుకొని - కథాసంవిధానాన్ని దిక్కుమాలిన దాన్నిగా చేస్తున్నారు. అలాంటివారి చేతుల్లో నవలో కథో కుక్కచావు చస్తోంది. (ప్రస్తుతం ఉదాహరణ లెందుకులెండి!)

ఒక కథాగత సన్నివేశాన్ని వివరిస్తున్నపుడు అర్థాంతరన్యాసంగా దానికి పతాకావిష్కరణ కలిగించడం గొప్ప కాదు. ఇదే మామూలు రచయితను కళాశీలిగా పరివర్తింప చేస్తుంది. ఆ నేర్పు విజయలక్ష్మి కథలలో తరచుగా అంతర్లీనమై ఉంది. అది అందరూ మెచ్చుకో దగ్గ విలక్షణత్వం! కొన్ని ఉదాహరణాలు చర్చిస్తారు.

1) చీకటి లోపల వెలుగు అనేది గొప్పకథ. అందులో 11వపుట పరిశీలిం

చవలసింది. తనకోరిక పాటించని భర్త మొండిపట్టుదలవల్ల గర్భస్రావం చేయించుకుంది సుశీల. డాక్టర్ జానకి అది ఆమె భవిష్యత్తునకు మంచిది కాదని, కనక తన కిష్టంలేదని, ఇష్టంలేని పనిని చేయలేననీ తిరస్కరించింది. కాని ఆ భర్త అప్పటికీ బుద్ధి తెచ్చుకుని తన ప్రయత్నం విరమించలేదు. అంత నైపుణ్యం లేని నర్సు దగ్గరకు సుశీలను తీసుకు వెళ్లాడు. ఆశమ్మ బోసెమ్మల సలహా శిరోధార్యం చేసుకున్నాడు నిర్భాగ్యుడు. ఆ నర్సు సుశీలకు అబార్షను చేయడమే కాక – మాతృత్వశక్తి శాశ్వతంగా కోల్పోయేరీతిగా వ్యవహరించింది. ఆర్థిక పరిస్థితులు బాగుపడ్డాక పిల్లల్ని కనబోయి, నిరర్థకమైన సందర్భంలో సుశీల డాక్టర్ జానకితో సంప్రదిస్తుంది. సుశీల మాటలు జాగ్రత్తగా వింటూ డాక్టర్ జానకి యిలా అనుకుంటుంది. 'డబ్బు పరిస్థితులు మనిషి జీవన విధానంమీద ఆలోచనారీతుల మీదా ఎలాంటి ప్రభావం చూపిస్తున్నాయో – ప్రతి వ్యక్తి జీవితాన్నీ చదువుతున్నప్పుడల్లా అర్థమవుతూనే ఉంది. ఐనా ఎప్పటికప్పుడు వింతగానే ఉంటుంది.' డాక్టరుగారి స్వీయానుభవాన్ని రచయితగా వింగడించి పాత్రగతం చేయడంవల్ల సార్వజనీనత పడుతుంది.

2) త్రాగడం గురించిన ప్రస్తావనలో విజయ అనే డాక్టర్ తన స్నేహితుడు వాసుతో యిలా అంటుంది. (ఒట్టు, నేను త్రాగను. పుట. 90) – మనిషి త్రాగ్గానే దుర్మార్గుడని అనన్నేను. పది మందికి అపకారం చేసే నిష్ఠాపరుడికన్న – పదిమందికీ మంచి చేసే వ్యసనపరుడే ఉన్నతుడంటాను. కాని ఔన్నత్యంతో పాటు నైతికమైన విలువలు కూడా ఉంటే – ఆవ్యక్తిని మిగతావాళ్ళు పూజించరూ!' అంటుంది. ఈకథని శ్రీ పు. సు. శర్మ 'సరదాగా చదువుకుందుకు వ్రాసిన బోయ్ మీట్స్ ది గరల్ స్టోరీ' అంటూ ఈసడిస్తూ లేబిల్ వేశారు. వారు కారణాలు వివరించలేదు. కారణాలేవైనా ఈమాటతో నేను సుతరామూ ఏకీభవించను. బోయ్ మీట్స్ ది గరల్ అనేది యిందులో ఇతివృత్తంగా ఉంది. దాన్ని పరిపుష్టం చేసిన రామణీయకత ఉంది. కాని అంతకుమించిన పాత్రల ఉదాత్త చిత్రణా, క్రియాశీలత దిశగా పాత్రలు పరిణామం చెందడం, సామాజికంగా వ్యక్తులు ఉత్తలీలామానుష విగ్రహాలుకాకుండా బాధ్యతదారులుగా వికాసం పొందడం వంటి ఆరోగ్యకర లక్షణాలెన్నో ఈ కథలలో ఉన్నాయి. అవే ఈకథకి ఉన్నతస్థానాన్ని కలిగిస్తున్నాయి. ఈ విషయాలన్నీ శ్రీ సుశర్మ ఎందువల్ల చూడలేకపోయారో అర్థంకాదు.

3) మాకీభర్తవొద్దు, ధిక్కారం అనే కథలు తన్నుబాగా ఆకర్షించాయని శ్రీ పురాణం చెప్పుకున్నాడు. ఈమాటతో కూడ నేను ఏకీభవించను. ఈ రెండూ సంఘటనాత్మకంగా జీవనవాస్తవికతకు విధేయమై రచయిత్రి ఆలోచనాత్మకంగా రాసినవి కావు. ముందుగా ఒక ఫార్ములా రూపొందించుకొని, దానికోసం సంఘటనలను పేర్చుకుంటూ రాసినవి. ఈ రెండు కథలలోనూ పాత్రల పెరుగుదల సహజంగా లేదు. క్రమ వికసనం కానరాదు. కృతకంగా రచయితకు కట్టుబానిసలై పాత్రలు బ్రతుకుతాయి. ఇవి రెండూ సాధారణకథలని నావిశ్వాసం. పైగా తాత్వికంగా మాకీభర్త ఒద్దు అనేకథలో ఒక అవాంఛితమైన తిరుగుడు కూడా ఉంది. మనసమాజం ఫ్యూడల్ నైతిక సూత్రాలపై బ్రతుకుతున్నపుడు – స్త్రీ పురుషుడికి వినోదవస్తువు. పరపురుషుని తాకినా ఆమె అపవిత్రం అవుతుంది. నానా శిక్షలకూ గురైంది. స్త్రీసమానత్వం అనే బూర్జువా ప్రజాస్వామ్యం కుటుంబ తలానికి దిగేసరికి – పురుషుడు ఏ అతీత పరిస్థితులలోనైనా యితర స్త్రీని తాకవలసి వచ్చినా – స్త్రీ నాకీభర్త వద్దు అని తెగించి వీధిలో పడుతుంది. స్త్రీ కొనుగోలు విక్రయపదార్థంగా మార్కెట్టులో నిలపబడుతున్న స్థితిలో చదువుకున్నదీ, ఉద్యోగం చేసి పొట్టపోషించుకోగలిగిందీ అయినప్పటికీ ఆ స్త్రీ జీవితం ముక్కలు చింపిన విస్తరి కాదా? అనేది నిత్యం ఎదురయ్యే విషమసమస్య! ఒకరికి తెలియకుండా ఒకరుగా ఇరువురు స్త్రీలు డాక్టర్ని వరించి దాంపత్యం చేస్తారు. ఇరువురూ ఎదురు బదురై సత్యం తెలుసుకుని కోపంతో యిరువురూ డాక్టర్ని విడిచిపెట్టి వెళ్ళిపోతారు. బానిసత్వం నుంచి బయటపడ్డ స్త్రీ పురుషులు సమానస్థాయిలో కలసి మెలసి పనిచేయవలసి వస్తున్న ప్రస్తుత సామాజిక దశలో యిరువురూ విచిత్రాకర్షణలకు లోనుకావడం సహజ పరిణామమే! ఈసమస్యకి రచయిత్రి చూపినమార్గం ఎన్నడూ పరిష్కారం కాబోదు! పైగా సర్వవిచ్ఛిన్నతకే దారి తీస్తుంది.

4) సంస్కారం అనే కథలో పుట 68 – 'ఆడ, మగ కలసి నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూంటే చూసీచూడనట్లు ఊరుకునేంతవరకే ఎదిగింది సమాజం! ఆడ మగ స్నేహాంతాలూ గాఢానుభూతుల్ని పంచుకుంటూంటే – అవి శరీర సంబంధాలకు అతీతంగా ఉండగలవని నమ్మేంత వరకూ ఈ సమాజం ఎదగలేదు.' అనే వాక్యం యథార్థదర్శనానికి నికషప్రాయమైనది. ఇలాంటి సందర్భంలో బలహీన రచయితలు గంగప్రవేశం చేస్తే – సాధారణంగా వాదుసంఘాన్ని పాపిష్ఠిసంఘాన్ని పడతిట్టి ఉతికి దంపి మన ప్రాణాలు తీస్తారు. డాక్టరు విజయలక్ష్మి – ఇలాంటి సందర్భంలో వహించే సంతృప్తత కొడవటిగంటి కుటుంబరావుగారినుంచి పుణికి పుచ్చుకున్నారా అనిపిస్తుంది.

5) మూడోసయినిస్ (రత్నగర్భ) అనే కథలో నాయిక శకుంతల. ఆమె సౌంద

ర్యాన్ని ఎంతహృద్యంగానూ ఎంత సంక్షిప్తంగానూ వర్ణిస్తారో ఈ క్రింది మాటల ద్వారా తెలుస్తుంది, 'శకుంతల పసుపూ, తేనె, గులాబీలు కలిపి రంగరించిన రంగులో ఉంటుంది. శ్వేతకమలపాపలా సుకుమారంగా వెన్నెలలాంటి చిరునవ్వుతో అందరినీ ఆకట్టుకుంటుంది శకుంతల.' నిజానికి ఇది భౌతిక సౌందర్యవర్ణనమే కాని అంతకన్న అతీతమైనది. అది భౌతికస్థాయికి పతితభావనాశాలిత్వాన్ని లాక్కుపోతుంది. లాలసవదలని సాధారణ రచయితలు కొలతల పట్టికలూ నిమ్నోన్నతాల రూపురేఖలూ సంసిద్ధంచేసి వర్ణనను జుగుప్సాకరం చేస్తారు.

కథనశిల్పానికి ప్రధాన జీవనధాతువులు లోకవృత్త పరిశీలనా, వ్యక్తులపాత్రగత శీలావగాహనా, కథనసంవిధానమూ మాత్రమే ఈ త్రిగుణాలు సజావుగా సంసిద్ధమైతే చాలు ఉత్తమకథ కాగలుగుతుంది. కాని ఒక కథను కావ్యస్థాయికి ఉద్ధరించడానికి ఈ మూడు సుగుణాలే సరిపోవు. ఒక రచయితను లేదా కథకుని కళాకారునిగా, కవిగా నిర్ణయించే మౌలిక జీవలక్షణం వర్ణనాత్మకశక్తి! వర్ణన అంటే అవసరమైనపుడూ కానప్పుడూ వివక్షారహితంగా వివరాలందించడం కాదు. ఈ శక్తి విజయలక్ష్మిలో విశిష్టరూపం ధరించింది. పాఠక హృదయంలో విస్పష్టముద్ర వేస్తుంది. ఒక్కొక్క సన్నివేశంలో రచయిత్రి భావుకత్వం పాత్రాతీతంగాకూడ ఆవిష్కృత మవుతుంది. ముఖ్యంగా పాత్రల సంభాషణలలో రచయిత్రి సంస్కారం మేలిముసుగులా కప్పుతుంది. ఇది సంయమనరాహిత్యంవల్ల ఏర్పడిన దోషమే కాని - తిరస్కరించవలసిన కళారాహిత్యం కాదు. అదిన్నీ అతివేలమూ కాలేదు.

ఈ 'మా కీర్తి వద్దు' అనే డాక్టర్ ఆలూరి విజయలక్ష్మిగారి కథల సంపుటిని నవోదయ పబ్లిషర్సు, విజయవాడ-2 (గుంటూరు-2)వారు ప్రచురించారు. 1/8 క్రౌను సైజులో 14+120 పుటలుగల ఈ సంపుటిలో - గాజులు, సూడో సయిసిస్, వలయంలో వనిత, మాకీర్తి వద్దు, సంస్కారం, ధిక్కారం; ఒట్టు నేను త్రాగను, చీకటిలోపల వెలుగు - అనే ఎనిమిది కథలున్నాయి. వెల ఆరురూపాయలు కథాసాహిత్యప్రియులంతా చదివి ఆలోచించి మననం చేసుకోదగ్గ మంచి కథ లనడంలో సందేహంలేదు

(26-1 80 న కవితాప్రవంతి ఆధ్వర్యంలో జరగిన గ్రంథావిష్కరణసభలో యిచ్చిన ఉపన్యాసానికి వ్యాసరూపం)

— శ్రీ సోమసుందర్

---

# ఆధునికాంధ్రసాహిత్యంలో బాల(క)ల వర్ణనలు

— శ్రీ పి. వి. సుబ్బారావు, ఎం. ఏ.

జాతిని జాగృతంచేసి వ్యక్తిత్వవికాసాన్ని, మానసికానందాన్ని కలిగించేదే సాహిత్యం. విశేషించి మానవతా, విలువలకు ప్రాముఖ్యమిచ్చేదే ఆధునిక సాహిత్యం. మానవ జీవితావస్థలన్నింటిలో బాల్యావస్థ బంగరుమయమైంది. జాతి సంపదకు ఆణిముత్యాలవంటివారు పిల్లలు. వారిలో జాతీయతా భావాలను, నీతిరీతుల సౌరభాలను గుబాళింపజేసి వారి మానసిక వికాసానికి దోహదంచేసేదే బాల సాహిత్యం. ఉన్నతమైన సాహిత్యసౌధాన్ని అధిరోహించ డానికి బాలవాఙ్మయం ప్రథమసోపానం. అందుకే కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'ఉన్నత కవితా వాహినికి బాలవాఙ్మయం ఆటపట్టు' అని చెప్పారు. కవితా రసాస్వాదన కవరోధకాలైన వ్యంగ్యాలు, శ్లేషలు బాల సాహిత్యంలో చోటుచేసికొనే అవకాశముండదు. స్వచ్ఛమైన తేట తెనుగు మాటలతో స్వేచ్ఛగాసాగి బాలబాలికల మనసులకాహ్లాదం కలిగిస్తుంది.. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొనే ప్రముఖ విమర్శకులు డాక్టర్ మిరియాలరామకృష్ణ 'పిండి ఆరబోసినట్లుగా, పాలుపారబోసినట్లుగా, హాయిగా కనిపించే వెన్నెలగా 'బాలసాహిత్యాన్ని అభివర్ణించారు. రసప్రపుల్లమైన బాలసాహిత్యం ఆటపాటలతో బాలలను ఆనందములో మునకలు వేయిస్తుంది.

బాలసాహిత్యాన్ని స్థూలంగా రెండు రకాలుగా వర్గీకరింపవచ్చును. మొదటిది బాలురకొఱకు వ్రాసింది. రెండవది బాలురనుగూర్చి వ్రాసింది. బాలబాలికల మానసికవికాసానికి ఉల్లాసానికి దోహదంచేసేది, బాలకులకు అందేది చెందేది మొదటివర్గపు సాహిత్యం. బాలుర ఉనికిని, ఆవశ్యకతను, ఆధిక్యమును, ఔన్నత్యాన్ని నిరూపించి వారిలో ఎనలేని ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని ప్రేరేపించేది, బాలకులనుగూర్చి సమంజసముగా సాకల్యంగా పెద్దలకు వివేచనకలిగించేదీ రెండవవర్గపు సాహిత్యం. బాలబాలికలకు మొదటివర్గపు సాహిత్య మెంత అవసరమో రెండవ వర్గపు సాహిత్యం కూడా అంతే అవసరం.

జాషువగారు 'శిశువు' అనే ఖండికలో శిశువునుగూర్చి చెబుతూ

'బొటవ్రేల ముల్లోకములుచూచి లోలోన
నానందపడు నోరులేని యోగి
తల్లిదండ్రుల తనూవల్లరీద్వయికి వ
న్నియవెట్టు తొమ్మిదినెలల పంట
అమృతంబువిషమను వ్యత్యాసమెఱుంగకా
స్వాదింపజను వెఱ్ఱిబాగులాడు

అనుభవించుకొలంది నినుమడించుచు మరం
దము జాలువారు చైతన్యఫలము
భాషరాదు వట్టిపాలుమాత్రమె త్రాగు
నిద్రవోవు, లేచి నిలువలేడు
ఎవ రెరుంగ రితని దేశ మేదొ కాని
మొన్న మొన్న నిలకు మొలిచినాడు'

అని వర్ణించారు శిశువుని 'నోరులేని' అనడంలో మాటలు రానివా డని, 'యోగి' అనడంలో సౌమ్యత, సాత్వికత, నిస్వార్థత మూర్తీభవించిన వాడని విషయం విదితమవుతుంది అమృతానికి, విషానికి వ్యత్యాసం తెలియనివా డని వర్ణించడంలో శిశువులోని మౌగ్ధ్యం సూచింపబడుతుంది జాషువా శిశువును 'ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశిగా వర్ణించారు తల్లిగర్భంనుండి బాహ్యప్రపంచానికి వచ్చిన నూతనవ్యక్తికాబట్టే 'మొన్న మొన్న నిలకు మొలిచినా' డని వర్ణించారు,

శైశవావస్థలో శిశువు ఏపాప మెరుగ డని జాషువా ధృవీకరించి యేండ్లు గడచిన ముందుముందేమోనన్న సంశయాన్ని వ్యక్తపరచారు నిజమే భవిష్యత్తులో అతనిపైబడే పరిసరప్రభావం మీదే అతడు మంచివాడు కావడంగాని, వంచకుడుగా తయారవడంగాని ఆధారపడి వుంటుంది

నవమాసాలు అన్నపానా లెరుగని పురుటింటి బాటసారిగా, చిక్కచీకట్లమయమైన మాతృగర్భంలో నిద్రించి లేచిన నిర్గుణునిగా, చెక్కిళ్ళపై బోసినవ్వులొలికిస్తూ, ముద్దులు కురిపించే మోహనుడిగా, అక్షయమైన మాతృక్షీరాన్ని అన్నంగా తెచ్చుకొన్న అతిథిగా జాషువా శిశువును వర్ణించి తన కవితాశిల్పాన్ని ప్రదర్శించారు

వచన కవితారథసారథులైన కుందుర్తి అజ్ఞాత'శైశవ'మనే ఖండికలో శిశువు బాహ్యప్రపంచానికి వచ్చిన విధాన్ని

'క్రొత్తగా పుట్టిన పసికందు
నవమాసాలచీకటిరాత్రితో పోరి
చివరకు గెలిచిన ఉదయరవిలా'

ఉందని వర్ణించారు నవమాసాలు తల్లిగర్భంలోచీకటితోపోరాడి బాహ్యప్రపంచానికి వెలుగులు వెదజల్లుతూ ఉదయించడం చీకట్లతో పోరాడే వెలుగుల విజయసారథియైన రవిలా వుందని ఉపమించడం మనోహరంగా వుంది జాషువా చెప్పిన 'ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి' అనే వర్ణనకు వన్నెపెట్టేటట్లుంది

ఆ ఖండికలోనే

'పసివాడు ఇంటిల్లపాదికి
కొనకుండా దొరికిన కనకం'

అని ఆయింటికి ఆయింట్లో ప్రతి ఒక్కరికంటికి దేదీప్యమానమైన వెలుగుల నందించే పసిడిజ్యోతివంటివా డని పసివాణ్ణి వర్ణించాడు పసివాడి కిలకిలల వెలుగులు, దరహాసపు మెరుగులు, ఆ చిన్నారి జిలిబిలి పలుకుల జిలుగులు ఇంట్లో అందరికీ ఎనలేని ఆనందాన్ని, అనుభూతినీ కలిగిస్తాయి ఆపసివాడునికి పసిడికన్నా మిన్నగా అనిపిస్తుంది 'పసివాడు కొనకుండా దొరికిన కనక మని కుందుర్తి చెప్పడం ప్రశంసనీయం.

మరొకచోట కుందుర్తి 'ఇంట్లో హఠాత్తుగా వెలిగినదీపం పసివా డని చెప్పారు. ఎనలేని పదవు లున్నా, ఎంతలేని సిరులున్నా బిడ్డలులేనియిల్లు కళావిహీనంగా వుంటుంది అప్పటివరకు తల్లిగర్భంలో దాగిన పసివాడు బాహ్యప్రపంచంలోకి అడుగుపెట్టగానే విద్యుత్తు ప్రసరించినట్లు తటిత్తు మెరపినట్లు యాదృచ్ఛికపు వెలుగు లాయింట్లో ప్రసరిస్తాయి ఆ యింట్లో అందరి డెందాలలో ఆనందాన్ని కందళింపజేస్తాయి ఆయింట్లో ప్రతిరోజు దేదీప్యమానమైన దీపాలపండుగని, ఆపసివాడు నిరంతరం వెలిగే పూలమతాబా అని, విశ్వమంతా వెలుగులు వెదజల్లే భూచక్ర మని, ఎప్పటికప్పుడు వెలిగే దీప మని వర్ణించారు కుందుర్తి

శ్రీశ్రీ శైశవగీతిలో బాలకులను గూర్చి-

'పాపంపుణ్యం ప్రపంచమార్గం
కష్టంసౌఖ్యం శ్లేషార్థాలూ
ఏమీఎరుగని పూవుల్లారా!
అయిదారేడుల పాపల్లారా!'

అని సంబోధించారు మానవజీవితావస్థ లన్నిటిలో బహుప్రశంసనీయమైంది బాల్యావస్థ చీకుచింతలు, కుట్రలు కుతంత్రాలు, మాయమర్మాలు తెలియని అమూల్యమైన అవస్థ బాల్యావస్థ ఈ బాల్యావస్థలోకూడా బాల్యపుతెగ జారకముందే బాహ్యప్రపంచపు పరిసర ప్రభావం బాలుని మనస్సుపై ప్రసరించక ముందే, అతడి మనస్సులో స్వచ్ఛత, ముగ్ధత, పవిత్రత తొణికిసలాడుతాయి అయిదారేళ్ళ వయస్సులోపలే ఆ అవకాశ ముంటుంది అయిదారేళ్ళు దాటిన బాలురపై పరిసరవాతావరణ ప్రభావంసోకి మౌగ్ధ్యం జారి మాయమర్మాలు చోటుచేసికొనే అవకాశ ముంది అందుకే శ్రీశ్రీ 'అయిదారేళ్ళపాప' లని సంబోధించారు పాపపుణ్యాలు, కష్టసుఖాలు సమాజవ్యవస్థలో పాతుకపోయిన అవినీతివిధానం, కుళ్ళు కుతంత్రం, తెలియని పాపలనడంలో అవి తెలిస్తే వారికైనతం మానసిక ప్రశాంతి భంగమవుతుం దని, అవి తెలియని ప్రశాంతమైన, సుకుమారమైన మనస్సులు కలవారుకాబట్టే బాలుర భగ్యలనీఅంటారు శ్రీశ్రీ ఆవయస్సులో నిర్మలమైన వారి మనస్సులు సువిశాలంగా వుంటాయి ప్రకృతిలో జరిగే ప్రతి క్రియ తమకొఱకే అనిభావించే ముగ్ధులు బాలు రని చెబుతూ

'మెఱుపు మెరిస్తే, వానకురిస్తే
ఆకాశమ్మున హరివిల్లు విరిస్తే
అవి మీకే అని ఆనందించే కూనల్లారా'

అన్నారు బాలకులకు పరమాత్మతో సామ్యంచెప్పి విశ్వరూపమున ప్రతిచోటా గరికపచ్చమైదానాల్లో, తామరపూవుల

కో నేరుల్లో, పంటచేలలో, బొమ్మరిళ్ళలో, తల్లిదండ్రుల కౌగిళ్ళలో. దేహధూళితో, కచభారంతో, నోళుల్రవేళుల పాలబుగ్గలతో విహరించే బాలకులను

'ఎక్కడచూస్తే అక్కడ మీరై
విశ్వరూపమున విహరిస్తూండే
పరమాత్మలు'గా వర్ణించారు.

మాయమర్మాలు, ఈర్ష్యాద్వేషాలూ తెలియని సువిశాలమైన మనసులుగల బాలకుల్లో పరమాత్మను దర్శించగలిగిన క్రాంతిదర్శి శ్రీశ్రీ.

నేటిపాపలే రేపటి పౌరులనే సామాన్య సూక్తిని ప్రగాఢంగా వివరిస్తూ

'మీదేమీదే సమస్తవిశ్వం
మీరే లోకపు భాగ్యవిధాతలు
మీహాసంలో మెరుగులు తీరును
వచ్చేనాళ్ళవిభాప్రభాతములు'

అని చెప్పారు. భవిష్యత్తులో సమస్త విశ్వపరిరక్షకులు, పరిపాలకులు బాలకులు కాబట్టి సౌభాగ్యవంతంగా విశ్వాన్ని తీర్చిదిద్దే విధాతలు కావాలని కాంక్షించారు. హాసం తెలుపునకు చిహ్నం. స్వచ్ఛతకు, పవిత్రతకు ప్రతీక. బాలకులు భావిభారత పరిపాలకు లయినపుడు అస్తవ్యస్తమయిన యీ సమాజ వ్యవస్థలో అలముకొన్న అవినీతి-చీకట్లను పారద్రోలి వెలుగులు వెదజల్లే ప్రభాతకాలపు రవిలా రానున్న కాలాన్ని తీర్చి దిద్దగలరని కాంక్షించారు. ప్రకృతిలోని షడ్రుతువుల పరిణతి బాలకులకొంటే నంటారు. బాలకులను చూస్తే గత శైశవరాగమాలికలు స్ఫురిస్తున్నాయన్నారు. శ్రీశ్రీగారిలా బాలలవర్ణన లద్భుతంగా చేశారు.

బాలబంధు బి. వి. నరసింహారావుగారు బాలకులను గూర్చి -

'పిల్లలంటే మల్లెమొగ్గలు
తల్లిమనసే విరిసివెన్నెల
లల్లుకొను జాబిల్లి విగ్గులు
ఊసులెన్నో మోసులెత్తే
బాస కర్థము ప్రాసబద్ధము
కదిపితే ఘలు ఘల్లుమ్రోగే
కంచుమువ్వలు మించునవ్వులు
ఉల్లమున చిరు ఊహలెన్నో
పల్లవించే పసిడితీగలు'

అని వర్ణించారు.

మరొకచోట పిల్లలను తము కొలిచే దేవుళ్ళుగా అభివర్ణించారు.

ఆధునికసాహిత్య వైతాళికుడు చలం పిల్లలలోని సౌకుమార్యాన్ని, సౌమనస్యాన్ని గ్రహించి

'పిల్లలను పూవుల్లాగ,
మెత్తని కాంతిలాగ,
నక్షత్రాల్లాగ,' చూడమన్నారు.

చలంవర్ణనలో 'మెత్తనికాంతి', 'నక్షత్రాలు' గమనించదగినవి. మృదుకాంతి కిరణాలు హృదయోల్లాస హేతువులు ఆహ్లాదకరమైన కాంతితో అలరించే నక్షత్రాలు కనులపండువు కలిగించేవి. బాలకులు సైతం హృదయోల్లాసం కలిగించేవారు కనులపండువచేసేవా రన్నవిషయ మిచ్చట ద్యోతకమవుతుంది. చలంకలం నుండి వెలువడ్డ యీవర్ణన కమనీయమైన భావుకతతో విలసిల్లుతుంది.

కరుణశ్రీ బాలకుల నుద్దేశించి -

'విరిసే పూరేకుల్లారా !
మురిసేచివురాకుల్లారా !'

అని సంబోధించారు. 'విరిసే పువురేకు' అందానికి చిహ్నం. మృదుత్వానికి సంకేతం. చివురాకులోని ఎరుపుదనం అనురాగానికి ప్రతీక. బాలకుల్లోని అందాన్ని మార్దవాన్ని, అనురాగాన్ని కరుణశ్రీ కమనీయంగా ప్రశంసించారు.

సుప్రసిద్ధకవులు దేవులపల్లికృష్ణశాస్త్రిగారు క్రాంతదర్శనత్వంతో బాల బాలికల్లో కవులను దర్శించి

'చెవులుంటే సరి—అవి వింటే
బాలురలోను కవులున్నారు
బాలికలందూ కలరు
చెవులుంటే సరి—అవివింటే'

నిష్కల్మషమైన పసిపాపల అంతరంగంనుండి అమాయికత్వంతో అప్రయత్నంగా వారినోట వెలువడే మాటలను శ్రద్ధాసక్తితో పరిశీలిస్తే అమూల్యమైన కవిత్వం అందులో కనిపిస్తుంది. బాలకులభాషకు వ్యాఖ్యాతలు బాలురే. పెద్దలవల్లకాదు. అందుకే కృష్ణశాస్త్రిగారిలా చెప్పారు.

డా॥ సి. నారాయణరెడ్డిగారు 'శిశువు' లోని మౌగ్ధ్యాన్ని గూర్చి

'శిశువుముందు పశువైనా
కొమ్ము వంచి నిల్చును లే'

అన్నారు. విచక్షణా రహితమైన పశువుసైతం శిశువులోని మౌగ్ధ్యానికి పరవశించి నిలుస్తుం దన్నవిషయ మిచ్చట విదితమవుతుంది.

ఏడిద కామేశ్వరరావుగారు—

'బాలప్రపంచం
పాల ప్రపంచం
పాలవలె తెల్లనిది
పాలవలె తియ్యనిది'

అన్నారు. బాలకుల మనసుల్లోని స్వచ్ఛత, మాటల్లోనిమాధుర్యం పాలతో వర్ణించడంవల్ల విదితం.

వక్కలంక లక్ష్మీపతిరావుగారు బాలురతో తాదాత్మ్యం చెంది వారిలోని త్యాగనిరతిని ప్రశంసిస్తూ

'బాలకులం బాలకులం
భావిభారత పరిపాలకులం
దేశంకోసం త్యాగంచేస్తాం
జాతిగౌరవం దక్కిస్తాం'

అన్నారు.

న్యాపతి రాఘవరావుగారికి అధికమైన ఆంధ్రాభిమానవల్ల తెలుగు పిల్లలే తెలుగుదేశానికి వెలుగులుగా, సొమ్ములుగా అగుపించారు.

(తరువాయి 15వ పేజీలో)



ఉభయమండలాల పట్టభద్రుల నియోజకవర్గమునుండి శాసనమండలి సభ్యత్వమునకు పోటీ చేయుచున్న

శ్రీ బలుసు ప్రభాకర బుచ్చికృష్ణ సత్యనారాయణరావుగారు.

వీరు 1959 వ సంవత్సరమున జరగిన సెంట్రలు సర్కారుల గ్రాడ్యుయేట్సు కాన్సిట్యుయన్సీనుండి ఎం. ఎల్. సీ. గా ఎన్నికై ఎనలేని సేవ చేసియుండిరి.

పదిహేనుసంవత్సరాలు నిరఘాటంగా తూర్పుగోదావరి జిల్లా పరిషదధ్యక్షులుగా వ్యవహరించి పెద్దలందరి గౌరవ మర్యాదలను ఆదరాభిమానాలను అందుకొన్న పరిపాలన దక్షులు.

ఉపాధ్యాయుల సంక్షేమానికై పాటుపడి వారి హృదయాలను చూరగొనగలిగిన ఉపాధ్యాయ పక్షపాతి. పరిషత్తు పాఠశాలల స్థితిగతులను మెరుగుపరచి విద్యాస్థాయిని పెంపొందించిన విద్యాభిమాని.

విద్యార్థులసంక్షేమానికి, మానసిక వికాసానికి, వినోదవిజ్ఞానాలకీ అనేకరీతుల పాటుపడి 'సాంగ్ & డ్రామా కాంపిటీషన్సు', వినోద విజ్ఞానయాత్రలు, ఏర్పాటుచేసి స్వయముగా పాల్గొని ఆనందించి బొమ్మూరుకొండమీద 'ఛిల్డ్రెన్సు పార్కు' ను మనోహరంగా తీర్చి దిద్దిన విద్యార్థిప్రియులు.

కపిలేశ్వరపురంలో వేద పాఠశాల నెలకొల్పి గురుశిష్యులకు సకల సదుపాయములు, ఉచిత వసతి భోజనాదులు, ఏర్పరచిన ఆర్షవిద్యాపోషకులు.

ద్వాదశ జ్యోతిర్లింగ దర్శనం చేసి శ్రీశైల భ్రమరాంబికా మల్లికార్జునస్వాముల దేవస్థాన పాలకవర్గ అధ్యక్షులుగా నుండి సేవచేయుచున్న ధన్యజీవులు.

హరికథాపాఠశాల నెలకొల్పి; అధ్యాపకులకు, అంతేవాసులకు అన్నిసౌకర్యములు ఏర్పరచి ఉచితంగా విద్యాదానం జరపించుచు ఇటీవల అపూర్వమూ, అద్వితీయమూ అనిపించేరీతిని రాజమండ్రి సనభాంతిగురుకులంలో హరికథా

వారోత్సవాలు నిర్వహించి అహర్నిశములు హరిహర నామ సంకీర్తన శ్రవణాదులవలన జనులకానందమును, ధన్యతను సమకూర్చిన కళాపోషకులు.

ఆంధ్ర దేశము నాలుగు చెరగులనుండి గొల్లకలాపము, భామకలాపము, కూచిపూడి నృత్యము మున్నగు కళలం దారి తేరిన విద్వాంసులను, కళా తపస్వులను రెండువందలమందిని సమావేశపఱచి బహువిధములుగా నున్న ఈ కళలకు ఒక నిర్ణీతమైన ప్రణాళికను (సిలబస్సును) వ్రాయించి ఈ కళల నభ్యసించువారికి, బోధించువారికి మార్గదర్శకులయిన కళాపిపాసులు.

గోదావరీ డెల్టాల ప్రజలచేత ఋషితుల్యు డనిపించుకొని గోదావరీ మండలాలను సస్యశ్యామలములుగా చేసిన సర్ ఆర్థర్ కాటన్ మహాశయుని జీవితచరిత్ర వ్రాయించి, ధవళేశ్వరములోని బాలుర పాఠశాల కా మహామహుని పేరు పెట్టించిన కృతజ్ఞతా హృదయులు.

మారేడుమిల్లి పరిస దున్నత పాఠశాలకి 'ఆరంస్ట్రాంగు పేరు పెట్టించి అమెరికన్ కాన్సలేట్ చేత ప్రారంభోత్సవం చేయించి వెనుకబడియున్న గిరిజన బాలబాలికలు సైతం విద్యావంతులై అత్యున్నత జీవితస్థాయినందుకోవాలని ఆకాంక్షించిన ఉన్నతాదర్శమూర్తి.

శ్రీమతి రామలక్ష్మమ్మ అన్నదాన సత్రమునకు నిర్వాహకులై నిరతాన్నదాతల వంశమువారై వంశమునకు వన్నె తెచ్చిన అన్నదాతలు. సహృదయులు, పరోపకార పారీణులు. వీరినిగుఱించి ఈ విధముగా ఎంత తెలిపినను స్వభావోక్తియే యగును.

ఆరయ సర్వజ్ఞుడు దక్షుడు
దార గుణాలయుడు లాలితకళావిదుడున్
నూరి జన బృందముల నతి
గౌరవమునఁజూచునట్టి ఘను డెల్లపుడున్.



( 13 వ పేజీ తరువాయి )

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారాంధ్రాభిమానంతో తెలుఁగు బాలకుల్లోని అచంచల దీక్షను, అనంతమైన సాహసాన్ని వర్ణించారు.

బాలల సంవత్సరంలోనే బాలకుల సంక్షేమాన్ని గూర్చి పట్టించుకోవడాన్ని అధిక్షేపిస్తూ ఆరుద్రగారు_

'ఏడవకు ఏడవకు
ఓ అంతర్జాతీయ బాల
ఏడిస్తే యియ్యేడె
నిన్నెత్తుకొంటారు రా !'

అన్నారు. అంతర్జాతీయ బాలల సంవత్సరంలోనే ప్రభుత్వం వారికి బాలకులపై హఠాత్తుగా ప్రేమ పుట్టింది. ఇంతకుముం దెన్నడూ పిల్లలపై చూపవలసిన శ్రద్ధ చూపకపోవడం లోకవిదితమైన విషయమే. భవిష్యత్తులో సైతం శ్రద్ధ చూపిస్తారన్న నమ్మకం లేనందువనే ఆరుద్రగారలా అధిక్షేపించారు.

భావిభారత నిర్మాతలు, నిర్ణేతలు, నైన బాలురపై మనం అనవరతరం శ్రద్ధాసక్తులు చూపిస్తేనే దేశం పురోగమిస్తుంది.

ఇంకా నార్ల చిరంజీవి, మద్దులూరిరామకృష్ణ, కవిరావు, శనగన నరసింహస్వామి, పాలడుగు నాగయ్య, యం. వి. యస్. శర్మ, వేజండ్ల సాంబశివరావు, ఆలపర్తి వెంకట సుబ్బారావు మున్నగు ఆధునిక కవులంతా బాలకులమనసులను పాలతో, పూలతో, పసిడితో పోల్చి వారిలోని సౌకుమార్యాన్ని, సౌమనస్యాన్ని, మృదునిర్మలత్వాన్ని, సాహసాన్ని, ఔన్నత్యాన్ని, త్యాగనిరతిని, ఉనికిని చక్కగా వర్ణించారు. బాలకుల్లో ఆత్మస్థైర్యాన్ని పెంచారు.

—...—

# కామ జిజ్ఞాస

— శ్రీ సాంబయ్య పరిమి, ఎం. ఏ.

కామ మనగా కోరిక. జిజ్ఞాస అనగ తెలిసికొనగోరుట. కామములు ప్రధానముగ రెండు రకములు. అవసరములు, అనుభవములు. అవసరము లనగా జీవించుట కవసరమైనవి. అనుభవము లనగా సుఖమును అనుభవింప దగినవి. ఈ అవసర కామములు సర్వజంతు సమానములు. అనగా జంతు తతి అంతయు ఈ కామములనే కోరును. కావున ఈ కామముల లక్ష్యము సమానము. లక్షణము భిన్నము. మానవుడును జంతువే కాన ఈ కామములకే లొంగినాడు. ఈ కామములలో ఒకటి శారీరకము. మానవునకు, జంతువునకు ఈ విషయమున సూక్ష్మభేదము కలదు. జంతువులకు ప్రకృతి నియమ ప్రకారము ఈ ప్రకంపనము శరీరమున జనించును. మానవుని విషయమున ఇది విపరీతము. ఈ విషయముచే మానవుడు జంతువులనుండి పృథక్కరింపబడినాడు. అంతేకాదు. అంగుష్ఠము నుపయోగించుకొనుట, వెలికిల పరుండ గలుగుట, రెండు చేతులనెత్తి కాళ్ళపై నడువగలుగుట, నవ్వగలుగుట, ముఖాముఖి లైంగిక సంబంధము; అను లక్షణములచే కూడ మానవుడు జంతుసమూహామునుండి వేరు పడినాడు.

ఈ శారీరక కామమునకు వేదములు సైతము ప్రత్యేకత నొసగినవి. ప్రథమతః నందీశ్వరుడు కామశాస్త్రమును బ్రహ్మనుండి వినెను. అంతేకాదు. కామము చతుర్విధ పురుషార్థములలో కీలకస్థానము నాక్రమించినది. వాత్స్యాయనాదిశాస్త్రజ్ఞుల మతమున పురుషార్థములు ధర్మార్థకామములు మాత్రమే 'ధర్మార్థకామేభ్యోనమః'(౧.౧.౧. వాత్స్యాయన కామసూత్రములు), ఈ కామమువలన కలుగు ప్రయోజనము అనన్యానందము. తైత్తిరీయోపనిషత్తు -

'మాతాపూర్వ రూపం। పితోత్తర రూపం। ప్రజా సంధిః। ప్రజనం సంధానం। ఇత్యధి ప్రజం' (శిక్షావల్లి 3 అనువాకం)

'మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ
ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ!
ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ
ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ।'
(శిక్షావల్లి 9 అనువాకం)

(వివాహాది శుభకర్మలయందు బంధుమిత్రాదులను సత్కరించుట అనెడు మానుషవ్యవహారము అనుష్ఠింప దగినది. పుత్రోత్పత్త్యర్థము చేయబడెడు పుత్రకామేష్టి మున్నగు ప్రయత్నము లనుష్ఠింప దగినవి)

- అని బోధించున వన్నియు ఉపాసనా ధర్మములే. అంతేకాదు.

'ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య
ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః'
(శిక్షా : 9 అను)

(ఆచార్యునికొరకు ఇష్టమైన ధనమును తెచ్చి ఇచ్చి ప్రజాసంతతి విచ్ఛిత్తి కాకుండ జేయుము.)

-అని శాసించుచున్నవి. ధర్మమైన అర్థమును, ధర్మమైన కామమును పొంది మోక్షగామి వగుమనియే చెప్పుచున్నవి. ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః'

'ప్రజనశ్చస్వాధ్యాయ ప్రవచనే చ' అని చెప్పుటచే నిగూఢముగ కామోపయోగమునకు ఆవశ్యకత ఏర్పడినది. 'ప్రజ' అనగ 'ప్రకర్షణే అవిచ్ఛిన్నం జాయంతే స్థూలోపాధిం సుఖాది భోగాయతనం గృహ్ణంతీతి ప్రజాః, తెంపులేకుండ స్థూలోపాధియగు సుఖాది భోగాయతనముల గ్రహించువారు. ఈ 'ప్రజ'లు నాలుగు రకములు -

1. జరాయుజములు - మనుష్యజాతి (జంతువులు కూడ)
2. అండజములు - పక్ష్యాదులు
3. ఉద్భిజ్జములు - వృక్షజాతి
4. స్వేదజములు - యూకజాతి (నల్లులు పేలు మొ॥)

పైని ప్రజాశబ్దము Animal Kingdom' అను అర్థమునం దుపయుక్తమైనది. ప్రస్తుతము మనుష్యజాతియని వ్యవహృత మగుచున్నది.

ప్రజాపతి ప్రజాహితార్థముగ 'స్థితి నిబంధన' మును రచించెను. అందుండి

బృహస్పతి అర్థాధికారికను, మనువు ధర్మాధికారికను, పృథక్కరించిరి. నందీశ్వరుడు అందుండి పది నూరధ్యాయములలో కామసూత్రములను వేరుపరచెను. దీనిని శ్వేతకేతుడు 500 అధ్యాయములుగ సంక్షేపించెను. ఈశ్వేతకేతుని కాలమునాటికి సాంఘిక వ్యవస్థ స్త్రీ విషయమున :

'పక్వాన్నమివ రాజేంద్ర
సర్వసాధారణా స్త్రియః
తస్మాత్తాసు న కుప్యేత ... '

(ఓ రాజేంద్ర ! పక్వాన్న మెటుల వీరిది వారిది అనుభేదము లేక సర్వసాధారణమైనదో అట్లే స్త్రీలు సర్వసాధారణలు) - అన్నట్లుండెడిది. అట్టి స్థితి నీతడు కట్టుబాటు కావించెను.

ఈశ్వేతకేతు శాస్త్రమునే బాభ్రవ్యుడు 150 అధ్యాయములను 1. సాధారణాధికరణము, 2. సంప్రయోగాధికరణము 3. కన్యాసంప్రయుక్తాధికరణము. 4. భార్యాధికరణము 5. పారదారికాధికరణము. 6. వైశికాధికరణము. 7. ఔపనిషదికాధికరణము. -అను అధికరణములలో సంక్షేపించెను.

ఈ బాభ్రవ్యుని గ్రంథమును ఆచార్య మల్లనాగుడు (ఈతనినే వాత్స్యాయనుడందురు). సంక్షిప్త పరచెను. అదే వాత్స్యాయనకామసూత్రములు. ఇందును సప్తఅధికరణములు కలవు. ప్రతి అధికరణమునందును విషయానుకూలముగ అధ్యాయ విభజనము కలదు. బాభ్రవ్యుని వర్గీకరణమును ఈతడు కేవలము అనుసరించె ననుటలో సందేహము లేదు.

కామము శాస్త్రమగునా ? కళయా ! అనిన, శాస్త్రమునకు,కళకుగల, భేదమును ముందు తెలిసికొనినగాని, ఈకామము శాస్త్రముగా నభ్యసింపనగునో లేక కళగా ఆరాధింపనగునో తెలియదు.

మనకుగల కళలలో ముఖ్యమైనవి 64. ఈకళలలో లలితకళలు అని అవాంతర భేదము కలదు. లలితకళలు పోను మిగిలిన కళలు మానవజీవితావసరములు. ఈ కళలవలన ప్రదర్శకులకు పరిశీలకులకు ఆనందము కలుగును. ఈకళలు జన్మసంస్కారము వలన కలిగి అభ్యాసపటిమచే అభివృద్ధి చేసికొనుటకు యోగ్యమైనవి.

శాస్త్రముల ప్రయోజనము ఆనందమును కల్గించునది కాదు. శాస్త్రములను స్వతః అభ్యసింపలేరు. గురుముఖమున నేర్చుకొనవలెను. ఇవి ధీశక్తిపై ఆధారపడినవి. ఇందు నేర్పరితనమునకు చోటు లేదు. వాత్స్యాయనాది మహామునుల అభిప్రాయమున 'కామము' శాస్త్రమే. దీనిని కూడ స్త్రీ పురుషులు గురుముఖమున అభ్యసింపవలె నని నిర్దేశించిరి.

153. 'అభ్యాసప్రయోజ్యాం శ్చ
చతుష్షష్టికాన్ యోగాన్ కన్యా
రహస్యేకాకీ అభ్యసేత్'
౧-3-14 సూ. (వాత్స్యాయన కామ
సూత్రములు).

154. ఆచార్యాస్తు కన్యానాం ప్రవృత్త
పురుషసంప్రయోగా, సహసంప్రవృద్ధా,
ధాత్రేయికా తిధా భూతా వా
నిరత్యయ సంభాషణా సఖీ,
సవయా శ్చ మాతృష్వసా,
విస్రబ్ధా తత్థానీయా వృద్ధదాసీ
పూర్వ సంసృష్టావా భిక్షుకీ
స్వసాచ విశ్వాసప్రయోగాత్'
౧-3-15 సూ. వా. కా. సూ.

కన్యల విషయమున ఆచార్యులు. 1. ధాత్రేయిక, 2. చెలికత్తె, 3. పినతల్లి, 4. వృద్ధదాసి, 5. భిక్షుకి, 6. తనతోబుట్టువు(అక్క) వీరివలన అభ్యసింపవలెను.

కళలవలన కలుగు ఆనందముకన్న అధికానందము,తృప్తి, 'కామమువలన కలుగుచున్నది. కావున కామమును కళ అనవచ్చునేమో! అల్లసాని పెద్దనయు' కామశాస్త్రోపాధ్యాయివి అని వరూథినిని సంబోధించినాడు.

ఈ రెంటికి సమన్వయము, కామమును అభ్యసన విషయమున, విషయమును గ్రహించు సందర్భమున శాస్త్రముగ నే భావింపవలెను. ప్రయోగ విషయమున, ప్రావీణ్యము కొలది శాస్త్రీయముగ ఆనందమును పొంద పాటుపడక, సందర్భోచిత ప్రక్రియా వైశిష్ట్యంతో నేర్పును చూపుచు కళగా ఆరాధించి ఆనందింపవలెను. అనుభవమున కామము కళ అగును. అభ్యసన విషయమున కామము శాస్త్ర మగును.

ఈకామము శాస్త్రము అనుదృష్టిచే రచింపబడిన దగుటచే రాగోదయమునకు ఉద్దీపనముగ, ఆలంబనముగ, అష్టవిధ ప్రక్రియలు, వాని అవాంతరములు నేర్పడినవి. కాముకుడు రతివేళ శాస్త్రనియమక్రమము ననుసరింపడు.

ఈ శారీరక కామము సర్వజంతు సమానము కదా అటులైన జంతువునకు లేని శాస్త్రము మన కేల ? మానవుని చేతలకు, జంతువుల చేతలకు హస్తిమశకాంతరము కలదు. మానవుడు ఆనందదృష్టి కలవాడు. జంతువు ఆహారమును సాధారముగా చేసికొని జీవించును. ఆనందదృష్టిలేని మానవకామము పాశవికము. ఈ ఆనందము కల్గుటకు పొందుటకు మానవునిచేతనే ఈ శాస్త్రము ఏర్పరుపబడినది. అభివృద్ధి పొందినది మానవునకే ఉపయోగపడుచున్నది.

* శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి వాత్స్యాయనకామసూత్ర ఆంధ్ర వ్యాఖ్యానము ఆధారము.



# రాజమండ్రి జ్యోతిశ్శాస్త్ర సభలు - పిడపర్తి సోదర సిద్ధాంతుల ఆక్షేపము



7-3-1980 తేదీ శుక్రవారం ఆంధ్రప్రభ దినపత్రికలో 'పంచాంగ రచనలో వైరుధ్యాలు' అనే శీర్షికతో వ్రాసిన వ్యాసమును చదివిన తరువాత రాజమండ్రి జ్యోతిశ్శాస్త్ర సభానిర్వాహకులైన వేద శాస్త్రపరిషత్తు వారి అభిప్రాయములను వివరింప వలసిన ఆవశ్యకత ఏర్పడినది

రాజమండ్రిలో సభలు ఏర్పాటు చేయుచు సభకు విచ్చేసి తమ తమ వాదములను సోపపత్తికముగా వివరింప గోరుచు వేదశాస్త్ర పరిషత్తు వారు పంచాంగ కర్తలందరకు ఆహ్వానములు పంపిరి శ్రీపిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి సిద్ధాంతిగారికి కూడ పంపిరి. వీరు రాజమండ్రి సమీపగ్రామమైన పొడగట్లపల్లి యందుండియు సభకు వచ్చియుండలేదు. కారణాంతరములచే రాలేక పోయినను నీసము తమ అభిప్రాయములను లిఖిత రూపముగా నైనను పంపియుండలేదు. అట్లు వచ్చుటగాని, పంపుటగాని జరగినచో, వారి అభిప్రాయములను కూడ సమగ్రముగా చర్చించుటకు వీలయ్యేడిది.

ఎక్కువగా అభిప్రాయభేదము అయనాంశ నిర్ణయ విషయముననే కన్పట్టుచున్నది. దీనిపై పెక్కు వాదోపవాదములున్నవి. పండితులందరకు ఆమోదయోగ్యమైన ప్రమాణ నిర్ణయ మింతవరకు జరుగక పోవుటచేతనే పునఃపునః పరిశీలనావశ్యకత ఏర్పడుచున్నది. పంచాంగ రచనలో వైవిధ్యం వల్ల ప్రజలకేర్పడే ఇబ్బందులు, అనవసర ధనవ్యయము, మున్నగునవి గుర్తించి వీలయినంతవరకు తన్నివారణోపాయము నన్వేషింప వలయునను సదుద్దేశముతో, రాజమండ్రి వేదశాస్త్ర పరిషత్తువారు అధికవ్యయ ప్రయాసలకు ఓర్చి ఈసభలు ఏర్పాటు చేసియున్నారు, ఇట్టి సదుద్దేశమును శంకించుట, నిష్ప్రయోజనముగా భావించుట, విధి దుర్విలాసమే యనుకొనవలయునుగాని అన్యము కాఁజాలదు.

1 'పంచాంగ వైరుధ్యాలను గురించిన సందేహాలను కొంతవరకు నివృత్తి చేస్తూ వ్రాయడానికి ప్రఖ్యాత జ్యోతిష విద్వాంస పండిత (పునరుక్తి వ్యాకరణ దోషము) సోదరులు ఈవ్యాసంలో ప్రయత్నించారు.'

2 'పంచాంగరచనలో వైరుధ్యం అంటూ ఏమీ లేదనీ రిఫారం కమిటీవారి సిఫార్సులను ఏనాడో ఆమోదించడం జరిగిందనీ వ్యాసకర్తలు సోపపత్తికంగా తమవాదన ప్రతిపాదించారు.' అనితమను గూర్చి దామే ఎవరో వ్రాస్తూన్నట్లు వ్యాసకర్తలు వ్రాసికొన్నారు.

ఇంతకూ వీరు అన్న ఉపపత్తులు గత రౌద్రపుష్కరసభ [అప్పటికి బహుశః వీరుపుట్టి ఉండకపోవచ్చును] 1934 మైసూరుసభ, 1955 పుష్కరాధికమాస నిర్ణయసభ 1968, ఢిల్లీసభ - ఇట్టి సభల తీర్మానములను పేర్కొనుటయే ఏ ప్రమాణముల ఆధారముగా ఆయాసభల నిర్ణయములు జరిగినదీ వివరింపలేదు. ఈవిధంగా వీరుద్దేశించిన సందేహనివృత్తి లక్ష్యం ఎంతమాత్రం నెఱవేఱలేదనుట సత్యదూరంకాదు.

అయనాంశములను గురించి స్థిర నిర్ణయము జరుగలేదనుటకు వారు వ్రాసినట్లు మరల మరల సభలు జరుగుటయే ప్రమాణము. ఒకవేళ నిర్ణయము జరిగియే యున్నచో అందలి సామంజస్యమును నేను భిన్న భిన్న అయనాంశములను స్వీకరించేవారికి సప్రమాణముగా వివరించి వారిచే ఆమోదింప జేయవలసిన బాధ్యత ఈప్రసిద్ధ జ్యోతిషపండితులపై నున్నది ఇట్టి సమన్వయపద్ధతికై సభల ఏర్పాటు ఎంతయు అవసరము ప్రభుత్వ శాసనం ద్వారా అది సాధించవలెనను కొనుట వారి వాదమునకు పుష్టిని చేకూర్పదు. సిద్ధాంతముల కంటెను, ప్రమాణముల కంటెను, శ్రీ మధిర కృష్ణమూర్తి సిద్ధాంతిగారి పేరు, శ్రీపాద వెంకటరమణ

సిద్ధాంతిగారి పేరు, శ్రీధూళిపాళ అర్క సోమయాజులు గారి పేరు, ప్రస్తావించిన తీరు చూడగా వీరి కాపండితులపై గల వ్యక్తిగత రాగద్వేషాదికమే అధికముగా గోచరమగుచున్నది

చైత్రపక్షాయనాంశలే స్వీకార్యములనీ 22 అయనాంశలు స్వీకరించిన పద్ధతియే శ్రేష్ఠమైన దనీ ఏనాడో నిర్ణయింపబడియుండగా, తాము ఒకటి రెండు సంవత్సరముల పూర్వమువరకు రెండు పద్ధతుల పంచాంగము లేల ప్రచురించియుండిరో దురూహము.

పంచాంగగణితము నిరయనపద్ధతిని సాగించి దృక్సిద్ధికై అయనాంశ సంస్కారాదికము గావించుట అవసర మనుకొన్నపుడు సాయన పద్ధతిలోనే పంచాంగ గణితము కూడ ఏలసాగింపరాదను ప్రశ్నకు సందేహమునకు అస్కారము లేకుండ నిరయనపద్ధతి పంచాంగ రచన గావించుట సమంజసమేయని నిర్ధారించుట అవసరమయియుండ ఆప్రయత్నము నాక్షేపించుట యుచితమగునా ?

అయనాంశనిర్ణయ విషయమున ఇంకను పరిశీలన అవసర మని దూరదృష్టితో గావించిన తీర్మానము ఆభాసమనీ, సభయందలి నిర్ణేతలూ అధ్యక్షులూ శక్తిహీనులనీ అనుట, దృక్సిద్ధమనమేమో అచట సమావేశమైన పండితుల కర్థము కాలేదనుట, సాహసముకాదా ?

(1) డా॥ శ్రీ ధూళిపాళ అర్క సోమయాజులు ఎం.ఏ పిహెచ్ డి

కార్యదర్శి, హిందూధర్మ రక్షణసంస్థ, తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి.

(2) జ్యోతిషాచార్య డా॥మురారిలాల్ శర్మ. సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయము వారణాసి.

(3) జ్యోతిషాచార్య డా॥ బ్రజ్ కిషోరఝా. కామేశ్వరసింహసంస్కృత విశ్వవిద్యాలయము, దర్భంగ.

(4) జ్యోతిషాచార్య పండిత రామచంద్ర ఝా. పంచాంగ ఎడిటరు కామేశ్వరి సింహ సంస్కృత విశ్వవిద్యాలయము దర్భంగ, (బీహారుస్టేటు)

(5) సాంగవేదార్థ సమ్రాట్ శ్రీ లంక వెంకట్రామశాస్త్రి సోమయాజి, నేదునూరు.

(6) శాస్త్రరత్నాకర, ఉభయ మీమాంసావిద్వాన్ శ్రీ డోంగ్రే వీరేశ్వర శాస్త్రి సికిందరాబాదు.

పై పండితులు సుప్రసిద్ధ జ్యోతిష విద్వాంస పండితులంతటివారు, వారి అభిప్రాయములో కాకపోవచ్చునుకాని శక్తిహీనులు, అర్థముకానివారు, అని ఈసడించుటకు అర్హులనే అభిప్రాయముతో, వివేకవంతులయిన సహృదయులు ఏకీభవింపజాలరు అట్టి పండితులే పనికిమాలినవారైనపుడు స్వర్గీయ వేపా రామేశం పంతులు గారినో, విస్సా అప్పారావు గారినో, పేర్కొని వారి తీర్మానములు పరమ ప్రమాణముగా భావించి వినుతించుట ఎంత రమణీయమో ఆలోచింపకలసియున్నది.

జ్యోతిశ్శాస్త్ర సభల తీర్మానములో 'సిద్ధాంతరీత్యా ఒక పంచాంగం దృక్సిద్ధిరీత్యా ఒక పంచాంగం ఉండడం మంచిది' అని ఎచటనూ లేదు లేనిదానిని ఉన్నట్లుగా ఎంచుకొని, అందులో పసలేదని పిడపర్తి పండితు లనడంలోని ఔచిత్యం వారికే తెలియవలెను. తాము పేర్కొన్న అయనాంశలనే గ్రహించి నూటికి 99 మంది పంచాంగ రచన చేయుచున్నట్లు పిడపర్తివారు వ్రాసియున్నారు. అది సత్యనిరూపణకు నిలుచునది కాదు

రిఫారం కమిటీవారి నిర్ణయములతో తృప్తిపడక ఇండియన్ నేషనల్ సైన్సు అకాడమీ ఢిల్లీవారు ఒక సెమినారు ఏర్పాటు చేసిన సంగతి పిడపర్తివారికి తెలిసియుండును.

1 నిరయనపద్ధతి పంచాంగ రచన శ్రేష్ఠము

2 రైవతపక్ష చైత్రపక్షాద్యయనాంశముల సాధించు విషయమున ఆర్యభట్ట, వరాహమిహిరాది పండితుల సిద్ధాంతములను పరిశీలించి సత్యనిర్ణయము చేయవలసియున్నది

అను తీర్మానములు అత్యంత సముచితములు, తొందరపాటు లేనివి. దూరదృష్టితో గూడినవి. అనుటలో సందేహము లేదు. రాగద్వేష రహితమైన బుద్ధితో జూచిన నీసభ లెంతమాత్రము నిరుపయోగములు కావని తోచకమానదు పిడపర్తివారి చైత్రపక్షవాద అయనాంశాయనా భావకాలములు సత్యదూరము లని, తప్పని శ్రీ మధిర కృష్ణమూర్తి సిద్ధాంతిగారు సహేతుకముగా, సప్రమాణముగా వేరే సమాధానము వ్రాసియున్నారు.

(ఆంధ్రప్రభవారి అనుచిత ప్రచురణవిధాన కారణముగా ఈ సమాధానము ఆలస్యముగా ఈ విధమున ప్రకటించడమైనది )

ఇట్లు,
పీసపాటి సూర్యప్రకాశం
కోశాధికారి,
వేదశాస్త్ర పరిషత్తు,
రాజమండ్రి.



# ఉద్గ్రంథములు

| | | |
|---|---|---|
| 1) | నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) | రు. 50—00 |
| 2) | నిర్వచన అధ్యాత్మ రామాయణము | రు. 20—00 |
| 3) | నిర్వచన మహాభాగవతము | రు. 30—00 |
| 4) | శ్రీ వేంకటేశ్వర విజయము | రు. 25—00 |
| 5) | కుందమాల నాటకము | రు. 5—00 |
| 6) | వేణీసంహార నాటకము | రు. 5—00 |
| 7) | శ్రీ వాల్మీకి రామాయణము మొదటి సంపుటము | రు. 30—00 |

కృతికర్త : ప్రకాశకుఁడు.

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.

8-22-14, గాంధీనగర్, కాకినాడ-4.

# రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము గ్రంథవిమర్శకు ప్రాముఖ్యము, ఔచిత్యము. మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయుఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలఁదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంత వరకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు —

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V. & Co, Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1